# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



విడి ప్రతి
**75** పైసలు

సంవత్సర చందా
రూ. **9/-**




LIFEBUOY
for health

అతిథులను అభ్యాగతులను ప్రేమపూరితంగా ఆహ్వానించండి–కడుపారా కోకా–కోలా త్రాగండి పుష్టికరమైన, సజీవకరమైన అరుచిని ఆనందించండి. హృదయం ఆనందంతో పురకలు వేస్తుంది.
ఎల్లవేళలా కోకా–కోలానే అడగండి.
మంచులాంటి చల్లని కోకా–కోలా త్రాగండి.
అడుగడుగున కోకా–కోలా,
ఆనందానికి కోకా–కోలా
కోకా–కోలా, కోకా–కోలా కంపెనీవారి రిజిష్టరు చేయబడిన ట్రేడుమార్కు.

**కోకా-కోలా**
**సాంగత్యం**
**బ్రతుకే ఒక**
**సారస్యం!**




CMCC-10-162 TEL

# కొంగ-నక్క

(నీతికథ మరోసారి)

రాజు అడవిలో నివసించే జిత్తులమారి నక్క తనతో అడవిలో నివసించే వారిని వేళాకోళం చెయ్యటమంటే యిష్టము. ఒకనాడు... 1

అమాయకమైన కొంగ శంకర్‌ని విందుకు పిలిచి పల్చటి పళ్లెంలో వడ్డించింది



2




3

వెంటనే శంకర్ రాజుని విందుకు పిలిచి...

4

...ఆశగొల్పించే బ్రూక్ బాండ్ A-1 డస్ట్ తేనీటిని ఇచ్చింది... నిడుపాటి మెడగల కూజాలలో!








5

రాజుకు బాగా తెలిసింది పాఠము




6




రాజుకి అహంకారం తగ్గింది—అందరికీ సవినయంగా రుచికరమైన A.1 డస్ట్ టీతో విందు చేస్తున్నాడు. 7



# అశోకా ఆమ్లా (రిజిష్టర్డు)

బ్రిలియంటైన్

అశోకా ఆమ్లా బ్రిలియంటైన్ యందు అమలక, భృంగ, వట్టివేరు చందన, కేతకి మొదలగు ఓషధులు చేరియున్నవి గాన, మెదడునకును కన్నులకును చల్లదనమును కలిగించును. మరియు శిరోజములయందు దినమంతయు పరిమళము వదలక యుండును. స్త్రీ పురుషులకు ఉత్తమ శిరోజాలంకార సాధనము.

## విజయా కెమికల్స్, మద్రాసు-7

*Stockists :*

1. S. Satyanarayan, Jawahatlal Nehru Road, Hyderabad,
2. National General Stores, Sultan Bazaar, Hyderabad,
3. K. R. Veeramalliah, General Bazaar, Secunderabad,
4. Venkateswara Agencies, Karimnagar,
5. Lahoti Fancy Stores, Karimnagar,
6. Sha Rikabchand Siremal & Co., K. V. R. Swami Road, Rajahmundry,
7. Rama Agencies, Chinna Bazaar, Nellore,
8. Rajendra Fancy Stores, Nandipativari Street, Vijayawada,
9. M. Durga Prasada Rao, Nandipativari Street, Vijayawada,
10. Gopalakrishna Fancy Stores, Gantalamma Tree Street, Guntur,
11. Radhakrishna Fancy Stores, Gantalamma Tree Street, Guntur,
12. Lakshmi General Stores, Main Road, Tenali,
13. Vijayalakshmi Distributors, Tenali,
14. Chundum Gopalakrishnamurthy, Repalli,
15. Sri Satyanarayana Fancy Stores, Ponnur,
16. Sagar General Stores, Kareemnagar,
17. Vajinapalli Rangiah Sons, Warangal,
18. Asok Trading Co., Hanamkonda,
19. Baley Veerasam, Jagtial,
20. E. Ch. Krishnamurthy, Godavari Street, Berhampur,
21. New Alankar Agarbathi Co., Kurnool,
22. M. T. D. Association, Masulipatam,
23. Peddi Papiah, Merchant, Vemulavada,
24. D. D. P. C. Gupta, Guntur,
25. Albert Cardeo, Merchants, Warangal,
26. Royal Stores, Sultan Bazaar, Hyderabad.





# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ ["రాజీ"] పంపిన వారు వై. వీరేంద్రనాథ్ బి. కాం.

ఈ నెలలోని "తనకు మాలిన ధర్మం", కిందటి నెల "సలహా అంతర్యం" కూడా గులిస్తాన్‌లోని కథలు.

"పంచవ్యాఘ్ర శూరుడు" అన్న కథలో నేర్చుకోదగిన అంశాలున్నాయి. స్వార్థం విద్వేషాలు పెంచినట్టే, సహకారం వైరులను ఏకం చేస్తుంది. పులులకూ మనుషులకూ మైత్రి పొసగదు; ఇద్దరి మధ్యా సహకారం ఏర్పడితే బలహీనుడు కూడా పైకి రాగలడు

సంపుటి 45 సెప్టెంబర్ '69 సంచిక 3









# చివరకు మిగిలినది

ఒక ఊళ్ళో రంగయ్యా అనే భూస్వామి ఉండే వాడు. అతని వద్ద యాభై పశువు లుండేవి. అతను లోభి అయినందున ఆ పశువులను కాయటానికీ, పాలూ అవీ తీయటానికీ వేరే మనిషిని పెట్టక, తానే ఆ పనులు చేస్తూవచ్చాడు.

అయితే అవి చాలా శ్రమతో కూడుకున్న పనులు. కొంతకాలం శ్రమపడ్డాక, పశువులను అమ్మేసి ఆ డబ్బుతో వ్యాపారం చేసుకుంటే లాభసాటిగా ఉంటుందని రంగయ్యకు తోచింది. ఆతను వాటిని తోలుకుని సంతకు బయలుదేరాడు.

నిర్జనమైన అడవి దారిలో పదిమంది దొంగలు గుంపుగా వచ్చి, రంగయ్యను ఒక చెట్టుకు కట్టి, పశువులన్నిటినీ తోలుకు పోయారు. తనను ఎవరో చిత్రహింస పెట్టి చంపుతున్నట్టుగా రంగయ్య ఎలుగెత్తి ఏడవసాగాడు.

అతన్ని దొంగలు కట్టేసిన చెట్టులో ఉండే దేవత అతన్ని చూసి జాలిపడి, ఆతని ముందు ప్రత్యక్షమై, అతని కట్లు విప్పి, "విచారించకు. నీ పశువులు పోయాయనే కదా నీ ఏడుపు. వాటికి బదులు నేను నీకు వేరే యాభై పశువులిస్తాను, తీసుకో!" అని, తన వేలినున్న ఉంగరం తీసి కళ్ళ కద్దుకున్నది.

వెంటనే అక్కడ యాభై పశువులు ప్రత్యక్షమయాయి.

"ఇక ఏడుపు మాని వీటిని తీసుకుపోయి ఎక్కడైనా అమ్ముకో," అన్నది దేవత రంగయ్యతో.

రంగయ్య పరమానందం చెంది, పశువులన్నిటినీ తడివి చూశాడు. అన్నీ సాధువులు; ఆరోగ్యంగా ఉన్నాయి.

"చూడు, తల్లీ, సంత ఇంకా చాలా దూరం ఉన్నది. దొంగలబారి పడకుండా

జి. సంపత్కుమార్

నేను వీటిని సంతకు చేర్చగలనా? ఇవన్నీ అమ్ముడవుతాయా? ఒకవేళ అమ్ముడయినా ఆ డబ్బుతో క్షేమంగా నేను ఇల్లు చేరుకుంటానా? నా కన్నీ అనుమానాలుగానే ఉన్నాయి," అన్నాడు రంగయ్య.

"అలా అయితే ఒక పని చెయ్యి. ఆవులకు బదులు డబ్బే ఇస్తాను. వీటి ఖరీదు ఎంత ఉంటుంది?" అన్నది దేవత.

"ఆవుకు నూరు చొప్పున, యాభైకీ అయిదువేల రూపాయలు," అన్నాడు రంగయ్య.

దేవత ఉంగరాన్ని మళ్ళీ కళ్ళ కద్దుకున్నది. దభాల్న అయిదువేల రూపాయల మూట ఒకటి రంగయ్య ముందు పడింది. రంగయ్య ఆ మూట ఎత్తి చూసి, "ఎంత బరువున్నదో! దీన్ని ఇంటి దాకా మోసుకు పోగలనా? ఒక్క ఆవును దయచేయిస్తే, దాని మీద ఈ మూట పెట్టుకుని పోతాను," అన్నాడు.

అందుకు దేవత సరే నన్నది. ఆవు మీద మూట ఉంచి రంగయ్య నాలుగడుగులు వేశాడో, లేదో, అతనికి మిగిలిన ఆవులను అక్కడ వదిలెయ్యటం చాలా బాధ అనిపించింది.

"తల్లీ, ఈ ఆవులన్నిటినీ నేను తోలుకు పోతే నీ కేమిటి అభ్యంతరం? వీటిని



నువు నా కివ్వనే ఇస్తివిగద?" అన్నాడు రంగయ్య.

"కావాలంటే అలాగే తీలుకుపో!" అన్నది దేవత.

మళ్లీ నాలుగడుగులు వేశాక రంగయ్యకు ఇంకొక్క ఆలోచన వచ్చింది. ప్రతి ఆవు మీదా వెయ్యేసి రూపాయల మూట ఒకటి ఉంటే ఎంత బాగుంటుంది! ఇక తనకు ఏ లోటూ ఉండదు. అందు చేత అతను మళ్ళీ వెనక్కు వచ్చి, "అమ్మా, అడిగిన దంతా లేదనకుండా ఇచ్చావు. ఆవులన్నిటి మీదా ఒక్కొక్క అయిదువేల రూపాయల మూట అనుగ్రహించావంటే నీ మేలు మరవను," అన్నాడు.

"అలాగే!" అంటూ దేవత ఉంగరాన్ని కళ్ల కద్దుకున్నది. వెంటనే అన్ని ఆవుల పైనా రూపాయల మూటలు వెలిశాయి.

రంగయ్య మనసు ఆనందంతో నిండటానికి బదులు, అనుమానంతో నిండింది. కొద్ది సేపటిలోనే తనకిన్ని కోరికలు కలిగాయి కదా, తన జీవితంలో ఇంకెన్ని కోరికలు కలుగుతాయో! వాటిని తీర్చుకోవటానికి ఆ ఉంగరం ఉంటే చాలు. అది దేవత కెందుకు? ఇలా అనుకుని రంగయ్య దేవతను సమీపించి, "తల్లీ, ఆ ఉంగరం నా కిచ్చేశావంటే ఇక నిన్ను బాధించను, నా దారిన నే పోతాను," అన్నాడు.

"వద్దు! మనిషిచెయ్యి తగిలితే దాని ప్రభావం పోతుంది," అంటూ దేవత తన చేతిని వెనక్కు తీసుకున్నది. రంగయ్య ఆమె మాటలు వినిపించుకోక, ఎక్కడ లేని ఆత్రంతో ఆమె చేతిలో ఉంగరాన్ని లాగేసుకున్నాడు.

మరుక్షణం దేవత మాయమయింది. పశువులూ, వాటిమీది మూటలూ మాయమయాయి. తాను తీసుకున్నాననుకున్న ఉంగరమూ మాయమయింది. రంగయ్య మాత్రమే మిగిలాడు.





# మానవత్వంలో తేడాలు

విక్రమపుర రాజు ఆకస్మికంగా చనిపోవటంతో చిన్నతనంలోనే యువరాజుకు రాజ్యాభిషేకం జరిగింది. లోకానుభవం లేని ఆ కొత్తరాజుతో రాజగురువు, "రాజ్యపాలన చేసేవాడికి మనుషులలో మానవత్వం ఎంతపాలున్నదీ తెలియటం అవసరం. ఆ సంగతి నీకు అవకాశం దొరికినప్పుడల్లా వివరించి చెబుతూ ఉంటాను, గ్రహించుతూ ఉండు," అన్నాడు.

"అది తెలుసుకోవటం ఎంత కాలం పట్టుతుంది?" అని రాజు అడిగాడు.

"శ్రద్ధగా మనుషుల ప్రవర్తనను పరిశీలిస్తూ పోతే ఎంతోకాలం పట్టదు," అన్నాడు రాజగురు. తన కొలువులో ఉండేవాళ్ళు తమకు కలిగే అనుభవాలను తనకు చెప్పేటట్టు రాజు ఏర్పాటు చేశాడు.

ఒకసారి రాజుగారి చారు డొకడు వచ్చి ఇలా చెప్పాడు:

"మహారాజా, అడవిదారిలో నడుస్తూండగా నా కాలిలో ముల్లు విరిగింది. నేను కుంటుతూ నడుస్తూండగా ఒకడు పరిగెత్తుకుంటూ వచ్చి, 'పులి వస్తున్నది తప్పుకో!' అని హెచ్చరించి, ఒక చెట్టెక్కాడు. నేను మరో చెట్టు ఎక్కాను. కొంచెం సేపటికి పులి ఆ దారినే వెళ్లిపోయింది. తరవాత ఇద్దరమూ చెట్లు దిగి, ఎవరి దారిన వాళ్ళం వెళ్లాం."

"ఆ మనిషి దగ్గిర ఆయుధాలు ఉన్నాయా?" అని రాజగురువు అడిగాడు.

"ఉన్నాయండి. మనిషి కూడా చాలా ధాటీగా ఉన్నాడు," అన్నాడు చారుడు.

తరవాత రాజగురువు రాజుతో, "చారుడు చెప్పిన మనిషిలో మానవత్వం నాలుగో వంతున్నది. పులి వస్తున్నదని హెచ్చరించాడు గాని, అవతలి మనిషిని రక్షించే ప్రయత్నం మాట ఆలోచించలేదు; తన రక్షణ తాను చూసుకున్నాడు," అన్నాడు.

ఎల్. రామనాథం

మరొకసారి మరొక చారుడు ఇంకొక సంఘటన గురించి చెప్పాడు.

ఒక దిక్కులేని పేదమనిషి తిండి లేక నీరసించి, ఒక ధనికుడి ఇంటి ముందు మూర్ఛపోయాడు. ధనికుడా మనిషికి తిండి పెట్టి, తన నౌకరుగా ఉంచుకున్నాడు. ఒకనాడు ఆ ధనికుడా నౌకరును చావగొట్టుతూంటే దారే వెళ్ళే మనిషి ఒకడు ఆగి, "ఎందుకు వాణ్ణి అలా కొడుతున్నావు?" అని అడిగాడు.

"శోష వచ్చి పడిపోయినప్పుడు వీడికి తిండి పెట్టి వీడు నాకు బతికున్నంత కాలమూ సేవకుడుగా ఉండేటట్టు పత్రం రాయించుకున్నాను. నాకు అమ్ముడుపోయినవాణ్ణి నా ఇష్టం వచ్చినట్టు చేస్తాను," అన్నాడు ధనికుడు.

దారే పొయ్యేవాడు ఆ పత్రం తెప్పించి చూసి, చించి అవతల పారేసి, పేదవాడితో, "నీ దాస్యం ముగిసింది. ఇక నీ యిష్టం వచ్చినట్టు తిరుగు," అని చెప్పి, తన దారిన వెళ్ళిపోయాడు.

"ఆ దారేపొయ్యేవాడిలో మానవత్వం సగపాలున్నది. అంతకన్న హెచ్చు ఉంటే, ఆ పేదవాడి భవిష్యత్తు గురించి ఏదైనా చేసేవాడు. వాణ్ణి మరొకరు కొనవచ్చు," అన్నాడు రాజగురువు.



"ధనికుడి మాట ఏమిటి?" అని రాజు అడిగాడు.

"వాడిలో మానవత్వం ఏ మాత్రమూ లేదు. వాడు నరరూప పశువు," అన్నాడు రాజగురువు.

ఒకనాడు రాజసభకు ఇద్దరు వర్తకులు దైన్యస్థితిలో వచ్చారు. వాళ్ళు విలువగల వస్తువులతో ప్రయాణం చేస్తూండగా దారిలో దొంగలు అటకాయించి, వాళ్ళ వస్తువులన్నీ లాక్కుని, వాళ్ళను చంపటానికి కత్తులెత్తారట. అప్పుడు వాళ్ళ నాయకుడు వాళ్ళను వారించి, "వెధవల్లారా, ఇలాంటివాళ్ళను చంపుతూ పోతే మనం ఎవరిని దోచుకుంటాం? మన వృత్తి ఎలా సాగుతుంది?" అని తమకు దారిఖర్చులకు గాను చెరి రెండు రూపాయలూ ఇచ్చాడని ఆ వర్తకులు చెప్పారు.

"దొంగల నాయకుడిలో ముక్కాలువంతు మానవత్వం ఉన్నది. వాడి వృత్తే వాణ్ణి పరిపూర్ణ మానవుడు కాకుండా చేస్తున్నది," అన్నాడు రాజగురువు.

ఒకరోజు రాజభటు డొకడు ఇద్దరిని రాజుగారి ఎదటికి తెచ్చాడు. వారిలో ఒకడు ధనికుడు, రెండోవాడు బీదవాడు.

"మహారాజా, ఈ బీదవాణ్ణి ఈ పెద్దమనిషి నీటిలోకి తోసి, తానూ పడ్డాడు. ఇది



నేను కళ్ళారా చూశాను. నేను దగ్గిరికి వచ్చేసరికి ఇద్దరూ ఒడ్డుకు చేరుకున్నారు," అన్నాడు భటుడు.

"ఆ మనిషిని నదిలోకి ఎందుకు తోశావు ?" అని రాజు ధనికుణ్ణి అడిగాడు.

దానికి ధనికు డిలా చెప్పాడు :

"మహారాజా, నే నీ మనిషికి ఇంకా చాలా ద్రోహాలు చేశాను. అన్నీ చెబుతాను, చిత్తగించండి. ఇతను నా పొరుగునే ఉంటాడు. బీదవాడూ, అసహాయుడూ అని అతని స్థలం చాలా దురాక్రమణ చేసి కాజే శాను. ఇతను నా దుర్మార్గం గురించి అంద రికీ చెబుతూ వచ్చాడు. నా పరువు తీస్తున్నా డని ఇతని ఇంటికి నిప్పు పెట్టించాను. దాన్ని గురించి విచారణ జరిగితే, అతని అజాగ్రత్త వల్లనే ఇల్లు కాలిందని లోకాన్ని నమ్మించాను. అతను తిరిగి ఇల్లు కట్టుకో లేకపోయాడు. ఇవాళ నదీతీరాన నాకు తారసిల్లి, 'నన్ను సర్వనాశనం చేశావే!' అన్నాడు. నాకు కోపం వచ్చి అతన్ని నది లోకి తోశాను. అతను నన్ను పట్టుకోవటం చేత నేను కూడా అతనితో పాటు నదిలో పడ్డాను. నేను ఈత రాక మునిగిపోతూ ఉండగా అతనే నన్ను కాపాడి ఒడ్డున చేర్చి, తాగిన నీరు కక్కించి రక్షించాడు."

రాజగురువు సలహాపై రాజు బీదవాడికి ధనికుడి చేత నష్టపరిహారం ఇప్పించి, మరే శిక్షా విధించక పంపేశాడు.

తరవాత రాజగురువు రాజుతో, "చూశావా, నాయనా? ఆ బీదవాడు సంపూర్ణ మానవుడు. అందుచేతనే అతను ధనికుడి స్వభావాన్ని సైతం మార్చగలి గాడు. సంపూర్ణ మానవుడు కానివాడు ఇత రుల స్వభావాలను మార్చి, వారిలో మాన వత్వం కలిగించలేడు," అని చెప్పాడు.

రాజగురువు చేసిన బోధలతో రాజుకు మానవత్వం ఎలా ఉండేదీ అర్థమయింది. అతడు దేశాన్ని చక్కగా పరిపాలించాడు.






## 21

[శిఖిముఖి కామాఖ్యనగరం నుంచి, జాంగ్‌లా అనే ఒక ఇభ్యజాతివాణ్ణి దారి చూపేందుకు వెంటబెట్టుకుని బ్రహ్మపుత్రా నదీలోయలకు బయలుదేరాడు. వాళ్ళు ఒక మహారణ్యంలో వుండగా జాంగ్‌లాను కొండచిలువ పట్టుకున్నది. శిఖిముఖి దాన్ని చంపాడు. అదిచూసిన అఘోరీలనే సన్యాసులు కొందరు అతడి మీదికి రాసాగారు. తరవాత—]

తన మీదికి వచ్చే అఘోరీలను చూసి శిఖిముఖి, తనకు చావు తప్పదనుకున్నాడు. వాళ్ళెంత క్రూరులో తన తండ్రి చెప్పగా లోగడ అతడు వినివున్నాడు. కాని, ఈ సమయంలో పారిపోవటం గాని, వాళ్ళను ప్రాణభిక్ష కోరటం గాని అవమానకరంగా శిఖిముఖికి తోచింది. చావు తప్పనిసరి అయితే, వాళ్ళను ప్రతిఘటించి పోరాడుతూ చావటమే మేలనుకున్నా డతను.

శిఖిముఖి యిలా ఆలోచించి కత్తి పైకెత్తి పెద్ద గొంతుతో, "విక్రమకేసరీ! నువు మన అంగరక్షకులతో తక్షణం ఇక్కణ్ణించి పారిపో. నన్ను అఘోరీల దండు చుట్టుముట్టుతున్నది. నా రక్షణకు వచ్చి నువ్వు అనవసరంగా చావటం ఎందుకు?" అని కేకపెట్టాడు.

శిఖిముఖి మాట ముగించే లోపలే, అఘోరీల్లో ఒకడు అతణ్ణి శూలంతో పొడవ




బోయాడు. శిఖిముఖి దాని దెబ్బ తప్పుకుని, ఆ అఘోరీని కత్తితో మెడ మీద బలంగా కొట్టాడు. వాడు, "మహాకాళా!" అని అరుస్తూ పక్కకు పడిపోయాడు. ఇంతలో అఘోరీల్లో ఒకడు, "ఆగండి! వాణ్ణి చంపకండి. వాడు విక్రమకేసరి గురువు పేరు ఉచ్చరిస్తున్నాడు," అని కేక పెట్టాడు.

ఆ సమయానికి అక్కడికి మరి నలుగురు అఘోరీలు వచ్చారు. శిఖిముఖి కేక వింటూనే, పారిపోవటానికి మారుగా, విక్రమకేసరీ, అజితుడూ, వీరభద్రుడూ కత్తులు దూసి అతడి రక్షణకు పరిగెత్తుకు వచ్చారు. అఘోరీల్లో మొదట మాట్లాడిన వాడు చేతులు చాచి తన వాళ్ళను కొంచెం వెనక్కు పొమ్మని చెప్పి, శిఖిముఖితో, "మీ కత్తులూ, ఈటెలూ మా అఘోరీల ముందు ఎందుకూ కొరగావు. నేను నా అనుచరుల్ని వెనక్కు పొమ్మన్నది, మీకు భయపడి కాదు. ఇంతకు ముందు నువ్వు విక్రమకేసరి గురువు పేరు తలిచావు. అంతే కాకుండా ఆయన్ని పారిపొమ్మన్నావు. ఇది చాలా వింతగా వున్నది! ఎవరివి నువ్వు? ఆ విక్రమకేసరి గురువు ఎక్కడ?" అని ప్రశ్నించాడు.

శిఖిముఖికి ఆ ప్రశ్నతో పరిస్థితి చాలా వరకు అర్థమైపోయింది. తాత విక్రమకేసరి చాలాకాలం పాటు అఘోరీలు వుండే ప్రాంతాన నివసించినట్టు, అతడు వదిలి పోయిన తాళపత్రాల ద్వారా తెలుస్తున్నది. తను కేకపెట్టి పారిపొమ్మన్నది, ఆ విక్రమ కేసరి నేనని వీళ్ళనుకుంటున్నారు.

విక్రమకేసరి తన సమీపానికి రాగానే శిఖిముఖి అతణ్ణి తనను ప్రశ్నించిన అఘోరీకి చూపుతూ, "ఇతడే విక్రమకేసరి! ఈయన తాతగారైన విక్రమకేసరి మహారాజు కొన్నేళ్ళ క్రితం ఈ ప్రాంతాలకే వచ్చారు. ఆయన ఏమైనదీ తెలియలేదు. ఆయన్ని వెతికేందుకే మేము శూరసేన





దేశం నుంచి బయలుదేరి ఈ ప్రదేశానికి వచ్చాం," అన్నాడు.

శిఖిముఖిని ప్రశ్నించిన అఘోరీ తతిమ్మా వాళ్ళకు నాయకుడు. అతడు శిఖిముఖి ఇచ్చిన జవాబు వింటూనే, విక్రమకేసరి ముందుకు వచ్చి వంగి నమస్కరించి, "విక్రమకేసరి గురువు పోలికలన్నీ నీలో వున్నవి. ఆయన మా ముఠా అఘోరీలకు ఆపదసమయాల్లో సలహా లిచ్చి, దీర్ఘ రోగాలను మూలికా చికిత్సతో నయంచేసీ ఎంతగానో సాయపడ్డాడు. ఆయన రుణం తీర్చుకోలేనిది. కాని..." అంటూ శిఖిముఖి ముఖంలోకి గుచ్చిగుచ్చి చూస్తూ, "ఇతడు చెప్పేది నా కేం అర్థం కావడం లేదు. విక్రమ కేసరి గురువు యింకా బతికుంటాడని మీ రెందుకు భావించారు? ఒకవేళ ఆయన బతికే వుంటే మీ దేశానికి ఎప్పుడో తిరిగి వచ్చేవాడు గదా?" అన్నాడు.

"ఆయన యింకా సజీవుడే అన్న కొన్ని వదంతులు మేం విన్నాం. బ్రహ్మపుత్రా నదీ లోయల్లోని ఒకానొక శిథిలాలయ ప్రాంతానికి ఆయన వెళ్ళినట్టూ, తరవాత ఆయన జాడ తెలియకుండా పోయినట్టూ, మాకు లభించిన తాళపత్రాల ద్వారా మేము ఊహించాం," అన్నాడు శిఖిముఖి.

"మీ ఊహ సరైనదే. విక్రమకేసరి గురువు ఇభ్యజాతి వాళ్ళు నివసించే లోయ ప్రాంతాలకు వెళ్ళాడు. తరవాత ఆయన జాడ మాకు తెలియలేదు. ఇభ్యులు ఆయన్ని చంపి వుంటారని మేం అనుకోం; ఆ ప్రాంతాల ఆయన ఏదో భయంకర వ్యాధికి గురై మరణించి వుంటాడని మా నమ్మకం," అన్నాడు అఘోరీల నాయకుడు.

"అదేదో యిదమిత్థంగా తేల్చుకో దలిచాం. కాని, మాకు ఒకానొక పూజారి నుంచే కాక, మీ అఘోరీల నుంచి కూడా ప్రమాదాలు తప్పనట్టున్నవి," అన్నాడు శిఖిముఖి.









శిఖిముఖి తామంతా దిగిన చెట్టు కిందికి వచ్చాడు. అజిత, వీరభద్రులు వంటపనిలో నిమగ్నులయారు. శిఖిముఖి, విక్రమకేసరిని దూరంగా తీసుకుపోయి, జాంగ్‌లాను కొండ చిలువ పట్టుకునే ముందు, తాను చెట్ల చాటున ఎవరో మాట్లాడుతున్న శబ్దం విన్న సంగతి చెప్పాడు.

"జాంగ్‌లాను ప్రశ్నించి నిజం తెలుసుకోవచ్చు గదా?" అన్నాడు విక్రమకేసరి.

"వాడు మనకు తెలియకుండా మరెవరితోనో చెట్ల చాటున మాట్లాడివుంటే—మన ప్రశ్నలకు వాణ్ణుంచి నిజం బయటపడదు. ఒకవేళ నేనే పొరబడి వుండివచ్చు. గాలికి చెట్ల ఆకులూ, చిరుకొమ్మలూ చేసే శబ్దం కూడా ఒకోసారి ఎవరో గుసగుసలాడుతున్నట్టు ధ్వనించటం జరుగుతుంది. ఏమైనా మనం మరి కాస్త అప్రమత్తులంగా వుండాలి," అన్నాడు శిఖిముఖి.

వంట పూర్తవగానే అందరూ భోజనాలు చేశారు. ఆ సరికి జాంగ్‌లా ఒళ్ళునొప్పులు పోయి, మామూలుగా నడవసాగాడు. చెట్టు కింద శిఖిముఖీ, విక్రమకేసరీ తమ వెంట తెచ్చిన నారపట్టాలతో చిన్న గుడారం వేసుకుని, దానిలో పడుకున్నారు. అజితుడూ, వీరభద్రుడూ, జాంగ్‌లా కంచరగాడిదలకు

ఆ మాటకు అఘోరీల నాయకుడు నవ్వి, "మా వాళ్ళ నుంచి మీకు ఎలాంటి హానీ కలగకుండా, ఇదిగో ఈ రుద్రాక్షల దండ నీ ముంజేతికి కడుతున్నాను. ఆ పూజారి సంగతి నాకు తెలియదు. మీ జాగ్రత్తలో మీరుండండి. మీ దేశానికి తిరిగి పోయేలోపల మిమ్మల్ని ఈ మహారణ్యాల్లో ఎక్కడో మరోసారి మేం తప్పక కలుసుకుంటాం. నా పేరు ఘోరచిత్తుడు," అని చెప్పి, శిఖిముఖి చేతికి రుద్రాక్షల దండ కట్టి, చావు బతుకుల్లో వున్న తమ అనుచరుణ్ణి తనవాళ్ళచేత పట్టించుకుని అఘోరీల నాయకుడు వెళ్ళిపోయాడు.



మేత వేసి, తాము దిగిన చోటుకు చుట్టూ అక్కడక్కడా నెగళ్ళు వెలిగించారు. అప్పటికే జాము పొద్దుపోవటంతో తతిమ్మా మూడు జాముల రాత్రిలోనూ, జాము కొకరు చొప్పున మేల్కొని వుండి, కాపలా కాయటానికి ఏర్పాట్లు చేసుకున్నారు.

మొట్టమొదటి కాపలా వంతు అజితుడిది. అతడు నెగళ్ళు ఆరిపోకుండా మధ్యమధ్య వాటి మీద ఎండుపుల్లలు వేస్తూ, చుట్టూ వున్న చీకట్లో నుంచి ఏవైనా మృగాలు గాని, శత్రువులు గాని వస్తున్నారేమో కనిపెట్టేందుకు గుచ్చి గుచ్చి చూడ సాగాడు. ఆ జాము కాలమూ ఎలాంటి దుర్ఘటనా లేకుండా గడిచిపోయింది. దూరంగా అరణ్యంలో పులి అరుపూ, నక్క కూతలూ మాత్రం అజితుడు విన్నాడు. మధ్యమధ్య ఏదో ఈల లాంటి ధ్వని కూడా అతడి చెవుల బడింది. బహుశా అది వెదురు పొదల్లో గాలి చేసే శబ్దం అయివుంటుందనుకున్నా డతను.

అజితుడి వంతు అయిపోగానే జాంగ్‌లా కాపలాకు పూనుకున్నాడు. అజితుడు పోయి వీరభద్రుడికి అంత ఎడంలో పడుకున్నాడు. కాని అతడికి నిద్ర సరిగా పట్ట లేదు. అఘోరీల దాడి చూసింతరవాత




అతడికి యీ అరణ్యంలో ఏ నిమిషాన ఎలాంటి ప్రమాదం వస్తుందో అన్న భయం పట్టుకున్నది.

కొద్ది కాలం గడిచింది. అజితుడు కొంచెం సేపు నిద్రతో జోగి, దూరాన్నించి ఏదో క్రూర జంతువు అరుపు వినబడగానే మత్తుగా కళ్ళు తెరిచి చూశాడు. జాంగ్‌లా నెగళ్ళ పక్కగా నిలబడి అరణ్యంలోకి చూస్తున్నాడు. వాడు సరిగా కట్టెలు వేయనందున నెగళ్ళు క్రమక్రమంగా ఆరిపోతున్నవి.

అజితుడు లేచి వాణ్ణి గట్టిగా కోప్పడదామనుకున్నంతలో, చెట్ల చాటు నుంచి



31

సన్నని ఈల వినబడింది. ఆ వెంటనే జాంగ్‌లా ఈటె భుజాన పెట్టుకుని కూర్చు న్నాడు. ఏదో మోసం జరగబోతున్నదని అజితుడు అనుకుని నిశ్శబ్దంగా తల తిప్పి శిఖిముఖీ, విక్రమకేసరులు నిద్రపోతున్న గుడారం కేసి చూశాడు. ఆ సమయంలో అక్కడ కనిపించిన దృశ్యం అతణ్ణి నిలు వెల్లా కంపించేలా చేసింది.

చిరుతపులి ఒకటి గుడారాన్ని సమీపించి, నేలను మూచూసి, గుడారం పట్టాల ఖాళీ లోంచి లోపలికి తలపెట్టబోతున్నది. ఇంత జరుగుతుంటే ఎర్రగండు ఏం చేస్తున్నట్టు? అనుకున్నాడు అజితుడు. అతడికి రానున్న ప్రమాదం అర్థం కాగానే, అంతవరకూ వున్న భయం కాస్తా ఎగిరిపోయింది.

"వీరభద్రా, లే! ప్రమాదం ముంచుకు వస్తున్నది!" అంటూ అతడు ఎగిరి లేచి, చేతిలో వున్న ఈటెను గురిచూసి చిరుత పులి కేసి విసిరాడు. అదృష్టం కొద్దీ ఆ ఈటె సూటిగా పోయి చిరుతపులి రొమ్ముల్లో గుచ్చుకున్నది. బాధతో అది పెద్దగా బొబ్బ రిస్తూ, పడుతూ లేస్తూ దూరంగా వున్న పొదల కేసి పోసాగింది.

అజితుడి కేకలూ, చిరుతపులి బొబ్బ రింతల్లో శిఖిముఖీ, విక్రమకేసరీ నిద్ర లేచి కత్తులు దూస్తూ గుడారం నుంచి బయటికి





వచ్చారు. ఈలోపల అజితుడు, నిద్రలేచిన వీరభద్రుడితో, జాంగ్‌లా పారిపోకుండా చూస్తూండమని చెప్పి, శిఖిముఖీ వాళ్ళ దగ్గిరకు పరిగెత్తి పోయి, జరిగిం దేమిటో రెండు మాటల్లో చెప్పి, "ఆ పొదల చాటు నుంచి ఈల వినిపించింది. అక్కడెవడో దాగివున్నాడని నా అనుమానం," అన్నాడు.

విక్రమకేసరి ఆ మాట వింటూనే, విల్లు తీసుకుని బాణం ఎక్కుపెట్టి, అజితుడు చూపిన పొదల కేసి ఒకదాని వెంట ఒకటిగా మూడు బాణాలు కొట్టాడు. మూడో బాణం జుయ్‌మంటూ పోయి ఒక పొదను తాకేసరికి, అక్కణ్ణించి పెద్దగా ఒక చావుకేక వినిపించింది. మరుక్షణంలో పొద బాగాకదిలినట్టయి, అందులో నుంచి నల్లని ఆకారం ఒకటి బయటికి పారిపోవటం కనిపించింది.

శిఖిముఖి, అజితుణ్ణి హెచ్చరిస్తూ, "ఈ గుడ్డివెన్నెల్లో వాణ్ణి ఒంటరిగా వెంబడించడం ప్రమాదం. శత్రువులు మరి కొందరు ఆ చుట్టుపక్కల ఎక్కడైనా దాగి వుండొచ్చు. మీ యిద్దర్లో ఒకరు జాంగ్‌లాను కనిపెట్టి వుండండి. మరొకళ్ళు మన సామాను రక్షణ చూడండి. నేనూ, కేసరీ పోయి ముందుగా, ఆ గాయపడిన చిరుతపులి ఎలా వుందో చూసి వస్తాం. గాయపడిన క్రూరమృగాన్ని వదిలి ఘారుకోవటం చాలా ప్రమాదం," అన్నాడు.

శిఖిముఖీ, విక్రమకేసరీ బయలుధేరగానే, అజితుడు, "శిఖిదొరా! ఇంత జరుగుతున్నా ఎర్రగండు అరవకుండా మొరగకుండా వున్నదేం?" అన్నాడు.

"దానికి ఎవరో ఎవరో ఏమిటి—ఈ జాంగ్‌లా మత్తుమందు పెట్టాడు. నీ కేక వినపడగానే దాన్ని తట్టి లేపాలని చూశాను. అది మత్తుగా పడి వున్నది....అదంతా తరవాత చూద్దాం," అన్నాడు శిఖిముఖి.

వెలుగుతున్న కట్టె ఒకటి తీసుకుని శిఖిముఖీ, విక్రమకేసరీ పొదలను సమీపిం

చేంతలో చిరుతపులి ఒకసారి గట్టిగా అరిచి వాళ్ళ మీదికి దూకబోయింది. కాని, బాగా గాయపడి వుండటం వల్లా, గుండెల్లో గుచ్చుకున్న ఈటె ముందుకాళ్ళకు అడ్డపడటం వల్లా, అది పొదలో నుంచి దూకుతూనే పక్కకు పడి గిలగిల్లాడ సాగింది.

శిఖిముఖి ఈటెతో దాని తల మీద రెండుసార్లు బలంగా పొడిచి, గుండెల్లో దిగి వున్న ఈటెను పట్టుకుని ఒక్క గుంజుతో బయటికి లాగాడు. చిరుతపులి ఓ క్షణ కాలం గిల గిల తన్నుకుని ప్రాణాలు విడిచింది.

"శిఖీ! ఇది చూశావా?" అంటూ విక్రమకేసరి తన ఈటెను చిరుతపులి మెడ మీద ఆనించాడు. అక్కడ ఒక తోలు పట్టెడ—చిరుతపులి మెడకు బిగించి వున్నది కనిపించింది.

"ఇది పెంపుడు చిరుత. దీన్ని పెంచిన వాడు స్వయంగా వచ్చి మనం వున్న గుడారం మీదికి దీన్ని వదిలి పొదల్లో దాక్కున్నాడు. వాడు నీ బాణందెబ్బ తిన్నాడు. ఇక వాడి సంగతి చూద్దాం పద," అంటూ శిఖిముఖి బయలుదేరాడు.

ప్రాణభయంతో గజగజ వణికిపోతున్న జాంగ్లా దగ్గిరకు అతడు రాగానే, జాంగ్లా దణ్ణంపెడుతూ అతడి పాదాల మీద పడబోయాడు. శిఖిముఖి, వాణ్ణి మెడ పట్టుకు గుంజి నిలబెట్టి, వాడి చేతిలో ఒక వెలిగే కట్టెపుల్ల పెడుతూ, "అన్ని సంగతులూ తరవాత మాట్లాడదాం. బాణందెబ్బ తిన్న నీ మిత్రుడు ఎలా వున్నాడో చూడాలి. ముందుండి దారితియ్యి. పారిపోవాలని చూశావో, నీ వెన్నులో ఈటె గుచ్చుతాను," అన్నాడు కఠినంగా.

జాంగ్లా మరింతగా వణికిపోతూ పొదల కేసి నడవసాగాడు. వెనగ్గా శిఖిముఖీ, విక్రమకేసరీ బయలుదేరారు.

—(ఇంకావుంది)






# రాజీ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఒక్కొక్కసారి విశ్వప్రయత్నం వల్ల లభ్యంగాని కార్యసిద్ధి దానంతట అదే సంభవిస్తుంది. ఇందుకు నిదర్శనంగా నీకు ప్రతాపుడి కథ చెబుతాను. శ్రమతెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

సుదర్శను డనే రాజు కోసలదేశాన్ని పాలించే కాలంలో విదేహదేశాన్ని జయదేవుడు పాలించేవాడు. ఆ రెండు దేశాలకూ మధ్య సత్సంబంధాలు లేవు. కావటానికి కోసలదేశమే పెద్దదీ, బలసంపన్నమైనదీ అయినా, తూర్పున ఉన్న దేశాలతో వర్తక సంబంధాలు పెట్టుకోవటానికి విదేహ పెద్ద అడ్డంకిగా ఉండటంచేత, ఈ వైరం

## బేతాళ కథలు



వల్ల కోసలకే హెచ్చు ఆర్థిక నష్టం కలుగుతూ వుండేది.

విదేహను జయించి లొంగదీసుకోవటం కోసలకు ఎంతో లాభకరం. కాని సుదర్శనుడు పిరికివాడు. దానికి తగ్గట్టు విదేహ రాజైన జయదేవుడు మహా పరాక్రమశాలి. కత్తి యుద్ధంలో అతను పదహారు కళలు ప్రదర్శించగలడని ప్రతీతి ఉండేది. అందు చేత సుదర్శనుడు విదేహతో యుద్ధానికి జంకాడు. అయినా విదేహను జయించాలన్న కోరిక మాత్రం ఆయనలో చావలేదు.

సుదర్శనుడికి ప్రతాపుడనే కొడుకు పుట్టాడు. తండ్రిలాగా అతను పిరికివాడు కాడు. మంచి శౌర్య పరాక్రమాలు గలవాడు. యుక్తవయస్కుడయేనాటికి అన్ని యుద్ధ విద్యలలోనూ అంతులేని ప్రావీణ్యం వచ్చింది. ప్రత్యేకించి కత్తి యుద్ధంలో అసాధారణ ప్రజ్ఞ సాధించుకున్నాడు.

సుదర్శనుడికి అవసానకాలం సమీపించినప్పుడాయన తన కొడుకును దగ్గిరికి పిలిచి, "నాయనా, నా చిరకాల వాంఛితం తీరుస్తానని మాట ఇయ్యి. జయదేవుడి ముందు నిలిచే శక్తిలేక నేను విదేహ మీదికి యుద్ధానికి వెళ్ళలేదు. నువు మహావీరుడివి. జయదేవుడు వయసు మళ్ళినవాడు. నువు అతనిపై యుద్ధం చేసి, గెలిచి, మనకు పక్కలో బల్లెంగా ఉన్న విదేహను కోసలలో కలుపుకో! ఈ పని నెరవేరినదాకా విశ్రమించనని మాట ఇయ్యి," అన్నాడు.

ప్రతాపుడు తండ్రి కోరిక తీర్చుతానని ప్రమాణం చేశాడు. తరవాత సుదర్శనుడు గతించటమూ, ప్రతాపుడు రాజ్యాభిషేకం చేసుకోవటమూ జరిగింది.

కొంతకాలం రాజ్యాంగాన్ని చక్కదిద్దుకోవటంతోనే ప్రతాపుడికి సరిపోయింది. అయినా అతను తండ్రికి ఇచ్చిన మాట మరిచిపోలేదు. మరిచిపోకపోగా అతనికి విదేహ మీదికి దండెత్తి వెళ్ళాలనీ, మహా

వీరుడని పేరు పడిన జయదేవుణ్ణి జయించి, అంతకన్న గొప్ప వీరుడనిపించుకోవాలనీ, తన రాజ్యానికి ప్రతిబంధకంగా ఉన్న విదేహ సింహాసనం కూడా తానే అధిష్ఠించాలనీ ఎంతో ఉబలాటంగా ఉన్నది.

అయినా ప్రతాపుడు విదేహ పైకి సైన్యాన్ని నడిపించే ప్రయత్నం ప్రారంభించలేదు. అందుకు కారణం జయదేవుడి కుమార్తె చారుమతి.

చారుమతి చక్కదనం గురించి ప్రతాపుడు ఎంతగానో విని, ఆమెనే పెళ్ళాడాలని ఏ నాడో నిశ్చయించుకున్నాడు. కాని వారి వివాహం జరగటం సాధ్యమయే విషయం కాదు. అందుకు ప్రతాపుడు చేయదగిన ప్రయత్నాలు రెండేరెండు: ఒకటి, విదేహ పైకి దండెత్తిపోయి, జయదేవుణ్ణి జయించి, అతని కుమార్తెను బలాత్కారంగా వివాహం చేసుకోవటం; రెండు, తాను తండ్రి ముందు తీసుకున్న ప్రమాణాన్ని గాలికి వదిలేసి, జయదేవుడితో ఏదో విధంగా రాజీపడి, చారుమతిని తన కిచ్చి పెళ్ళి చెయ్యమని వేడుకోవటం.

బలాత్కార వివాహాన్ని చారుమతి నిరసించవచ్చు. తన వేడికోలును జయదేవుడు నిరాకరించవచ్చు.




అందుచేత ప్రతాపుడికి గొప్ప విషమ సమస్య తటస్థపడింది. ఆ పరిస్థితిలో ప్రతాపుడు మూడో మార్గం ఒకటి చూసుకున్నాడు. అతను రాచకార్యాలన్నిటినీ కొంత కాలంపాటు మంత్రులను చూస్తూ ఉండమని, మారువేషం వేసుకుని, తన పేరు ప్రసేనుడని మార్చుకుని విదేహ దేశం ప్రవేశించాడు.

అతను తగిన అవకాశం కోసం వేచి ఉండి చారుమతిని కలుసుకుని, తానెవరో చెప్పి, తనకు ఆమెపై గల ప్రేమ వెల్లడించి, ఆమె అభిప్రాయం అడిగాడు. చారుమతి కూడా అతన్ని గురించి విని ఉన్నది. తమ





ప్రతాపుడు మర్నాడు రాజును ఏకాంతంగా కలిసి మాట్లాడటానికి అనుమతి సంపాదించాడు. జయదేవుడు అతన్ని తన సమక్షానికి రానిచ్చి, "ఏమిటి నువ్వు నాతో మాట్లాడదలిచిన విషయం?" అన్నాడు.

"మహారాజా, నాపేరు ప్రసేనుడు. రాజవంశంవాణ్ణి. చాలా కాలంగా కోసలరాజు కొలువులో ఉన్నాను. అక్కడి గుట్టుమట్లన్నీ నాకు తెలుసును. తమరు కోసలను జయించదలిస్తే, అందు కవసరమైన సహాయమంతా నేను తమకు చెయ్యగలను," అన్నాడు ప్రతాపుడు.

తాను తలుచుకుంటే జయదేవుడు రక్తపాతంలేకుండానే కోసలను జయించగలడు. ఈ ఉపకారం చేసినందుకు ఆయన తనకు తన కుమార్తె నివ్వటానికి సందేహించడు. తనకూ చారుమతికీ వివాహం అయిన మరుక్షణం రెండు రాజ్యాలూ ఒకటవుతాయి. రెంటికీ తానే రాజవుతాడు. తండ్రి కోరికా నెరవేరుతుంది, తన కోరికా నెరవేరుతుంది.

ప్రతాపుడి ఈ ఎత్తుగడ పారలేదు. దానికి కారణం, అతను చారుమతితో మాట్లాడినప్పుడామె ముఖ్య పరిచారిక అంతావిన్నది. ఆమెను ప్రతాపుడు లక్ష్యపెట్టలేదు. ఈ రోజు ప్రతాపుడు రాజుతో మాట్లాడటానికి

దేశాల మధ్య శత్రుత్వమే లేకపోతే తమ వివాహం సులువుగా జరిగి ఉండేది గదా అనుకుంటూ వచ్చింది. అందు చేత ఆమె అతనికి తన సమ్మతి క్లుప్తంగా తెలియజేసింది.

ఇక జయదేవుడి సమ్మతి సంపాదించవలిసి ఉన్నది. అందుకు కూడా ప్రతాపుడొక పద్ధతి ఆలోచించాడు. అది చాలా హేయమైన పద్ధతే—కాని దానిద్వారా తండ్రి కోరిక నెరవేరుతుంది. ఆ పద్ధతి ఏమంటే, తాను విదేహపై దాడిచేసి దాన్ని గెలిచే బదులు, జయదేవుణ్ణే కోసల గెలవనివ్వటం!

రహస్య మందిరంలోకి పోవటం ఆ పరిచారికే చూసి, రహస్యంగా వారి మాటలన్నీ విన్నది. జయదేవుడు, "ఆలోచించి చెబుతాను. నువు ప్రస్తుతం రాజభవనంలోనే ఉండు," అని ప్రతాపుణ్ణి అవతలికి పంపగానే ఆమె రాజు వద్దకువచ్చి, "మహారాజా, ఆ యువకుడి మాటలు నమ్మకండి. అతను కోసలదేశపు రాజు," అన్నది.

జయదేవుడు తోక తొక్కిన తాచులాగా అయిపోయి, ప్రతాపుణ్ణి బంధించి, చెరసాలలో పెట్టించమని ఉత్తరు విచ్చాడు.

ఈ సంగతి తెలిసి చారుమతి ఎంతో దుఃఖించింది. ఆమె తన తండ్రి వద్దకు వెళ్ళి, ప్రతాపుడు ద్రోహబుద్ధితో వచ్చినవాడు కాడనీ, తనపై ప్రేమ ప్రకటించుకోవటానికి నానా అగచాట్లూ పడ్డాడనీ, అతన్ని వెంటనే చెరవిడిపించి, తమ ఇద్దరికీ వివాహం చెయ్యమనీ దీనంగా వేడుకున్నది.

"ఆ నీచుడి పక్షాన నా కర్తవ్యం బోధించకు. నిన్ను ఎలాటి వాడికిచ్చి పెళ్ళి చెయ్యాలో నాకు బాగాతెలుసు," అని జయదేవుడు తన కుమార్తెను విదిలించి పారేశాడు.

ఆ సాయంకాలమే ఆయన చెరసాలకు వెళ్ళి, ప్రతాపుణ్ణి కలుసుకుని, "బుద్ధి



హీనుడా, ఈ రాజ్యంలో అడుగు పెట్టటం అపాయమని తెలిసి కూడా ఎందుకు అడుగు పెట్టావు? ఏ కారణంచేతనైనా రాగోరితే బాహటంగా రాక పిరికిపందలాగా మారువేషంలో ఎందుకు వచ్చావు? ఇప్పుడు నేను నీ తల తీయిస్తే అడ్డేదెవరు?" అని అడిగాడు.

ప్రతాపుడి ముఖంలో భయలక్షణాలు కనబడతాయని ఆయన అనుకున్నాడు. కాని అలాటిదేమీ జరగలేదు. ప్రతాపుడు చిన్నగా నవ్వి, "నేను మీ రాజ్యంలోకి ప్రచ్ఛన్నంగా వచ్చినది నా క్షేమం కోసం కాదు. మీ రాజ్యం క్షేమంకోరి. నేను బాహా



టంగా రాదలిస్తే సైన్యాలతోనే రావాలి. అదే జరిగితే మీ రాజ్యం ఒక్కరోజులో శ్మశానంగా మారిపోతుంది. నేను వచ్చినది మీ కుమార్తె చారుమతి హృదయం తెలుసుకోవటానికి, మీ రాజ్యాన్ని నేలమట్టం చెయ్యటానికికాదు," అన్నాడు.

"నా కుమార్తె హృదయం తెలుసుకున్నావా?" అని జయదేవుడు అడిగాడు.

"తెలుసుకున్నాను. నన్ను పెళ్ళాడాలన్న వాంఛ ఆమెలో గాఢంగానే ఉన్నది," అన్నాడు ప్రతాపుడు.

"పిరికిపందవు! నన్ను జయించలేక నా కుమార్తెను పెళ్ళాడి, ఆ విధంగా నా రాజ్యం హరించుదా మనుకున్నావు. నా రాజ్యం నేలమట్టం చేస్తానని ప్రగల్భాలెందుకు?" అన్నాడు జయదేవుడు.

"మీ కుమార్తెను పెళ్ళాడటంతోబాటు మన రాజ్యాలు రెండూ ఏకంకావాలన్న కోరిక కూడా నాకున్నది. అలా జరగాలంటే నేను మీ రాజ్యమైనా గెలవాలి; మీ చేత నా రాజ్యాన్ని గెలవనివ్వటమైనా చేయాలి. నా రాజ్యం గెలవటానికి మీకు సులభోపాయం చెప్పాను. అందులో ఏదో ద్రోహం ఉన్నట్టు మీరు నన్ను చెరపెట్టించారు," అన్నాడు ప్రతాపుడు.

"నువు ఎంతో పిరికిపందవై ఉంటే తప్ప నీ రాజ్యాన్ని నాకు కానుకపెట్టాలని చూడవు. నీకు శిరశ్ఛేదమే తగిన శిక్ష," అన్నాడు జయదేవుడు.

ప్రతాపుడు ఆశ్చర్యంగా, "మీరు మహా పరాక్రమ వంతులని దేశదేశాలా చెప్పుకుంటున్నారు. శత్రువును నిరాయుధుడుగా పట్టి శిరశ్ఛేదం చేసేవాడి కన్న పిరికిపంద ఎక్కడుంటాడు?" అన్నాడు.

జయదేవుడి ఆగ్రహం నసాళం అంటింది. ఆయన ఆ కోపాన్ని నిగ్రహించుకుని, "నేను ఉదారస్వభావంతో నిన్ను విడిచిపుచ్చితే ఏం చేస్తావు?" అన్నాడు.

"మీరు అలాటి సాహసమే చేస్తే, నేను మా దేశానికి వెళ్ళి సేనలను తరలించుకు వచ్చి మీ దేశాన్ని నామరూపాలు లేకుండా చేసేస్తాను. వీలుపడితే ద్వంద్వ యుద్ధంలో మీ ప్రాణాలు తీసేస్తాను," అన్నాడు ప్రతాపుడు.

జయదేవుడి కళ్ళు మెరిశాయి. ఆయన ప్రతాపుడితో, "ఇప్పుడే నీకు వీలుకలగ జేస్తాను. నాతో ద్వంద్వ యుద్ధం చెయ్యి," అన్నాడు.

అప్పటికప్పుడే ప్రతాపుణ్ణి చెరవిడిపించారు. జయదేవుడు శస్త్రచికిత్సకులను రప్పించి, ప్రతాపుడికి ఒక కత్తి యిచ్చి, తానొక కత్తి తీసుకుని యుద్ధానికి సిద్ధంగా నిలబడ్డాడు.

యుద్ధంలో చాలాసేపు జయదేవుడూ, ప్రతాపుడూ సమ ఉజ్జీలుగా కనబడ్డారు. జయదేవుడు ప్రదర్శించిన కళలన్నిటికీ ప్రతాపుడు ప్రతిక్రియలు చేశాడు. కాని ఆఖరులో జయదేవుడు ప్రతాపుడి చేతి కత్తిని ఎగరగొట్టాడు.

ప్రతాపుడు అమితాశ్చర్యంతో, "ఈ కళ నేనెన్నడూ ఎరగనే!" అన్నాడు.

జయదేవుడు ప్రతాపుడి భుజం తట్టి, "అల్లుడూ, నువు నేర్చుకోవలిసిన కళలు




ఇంకా ఒకటి రెండున్నాయి. వాటిని నీకు అల్లుడి కట్నంకింద ఇచ్చుకుంటాను. నీ వివాహానికి తరలిరమ్మని మీ దేశానికి కబురు పంపు," అన్నాడు.

మంచి ముహూర్తాన ప్రతాపుడికీ, చారుమతికీ వివాహం అయిపోయింది. కోసల, విదేహరాజ్యాలు ఏకమయాయి. కాలక్రమాన రెంటికీ ప్రతాపుడే రాజై, తన తండ్రి చివరి కోరికను పూర్తిచేశాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నాకొక సందేహం. జయదేవుడు ప్రతాపుణ్ణి ద్వంద్వ యుద్ధంలో ఓడించికూడా, ఆకస్మికంగా అతన్ని తన అల్లుడు చేసుకోవటానికి

ఎందుకు నిర్ణయించాడు? తన కుమార్తె అతన్ని ప్రేమించిందనా? లేక ఎప్పటికైనా అతను తన రాజ్యాన్ని మట్టుపెడతాడనా? ఒకవేళ ఇది ఆకస్మిక నిర్ణయం కాకపోతే, తన అల్లుణ్ణి చేసుకోదలచి కూడా ఆయన ప్రతాపుడితో ఎందుకు ద్వంద్వ యుద్ధానికి తలపడ్డాడు? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "జయదేవుడు ప్రతాపుడికి తన కూతురునిచ్చి చెయ్యాలని నిర్ణయించినది ద్వంద్వ యుద్ధం అయాకనే. ప్రతాపుడు పిరికిపంద అన్న అనుమానం ఆయనలో చాలా గాఢంగా నాటుకుని ఉన్నది. ప్రతాపుడి తండ్రి జగత్ప్రసిద్ధుడైన భీరువు. ప్రతాపుడి ప్రవర్తన కూడా పిరికి వాడి ప్రవర్తనలాగే జయదేవుడికి కనబడింది. ప్రతాపుడి మాటలు మాత్రం మహావీరుడికి తగినట్టుగా ఉన్నాయి. అతను మహావీరుడో, పిరికి వాడో తేల్చుకోవటానికే జయదేవుడు అతనితో ద్వంద్వ యుద్ధం సాగించాడు. ప్రతాపుడు ద్వంద్వ యుద్ధంలో జయదేవుడికి సమానం కాకపోయినా, అతను గొప్ప వీరుడన్నది మటుకు రూఢి అయిపోయింది. తను ఓడిపోయాక కూడా అతను ఓడినందుకు దుఃఖించక, కత్తి యుద్ధంలో తాను ఎరగని లాఘవాన్ని జయదేవుడిలో చూసి అబ్బురం చెందాడు. అది నిజమైన వీరుడి లక్షణం. అందుకే జయదేవుడు తన కుమార్తెను అతని కిచ్చి చెయ్యటానికి నిశ్చయించాడు. విదేహ ఎలాగైనా చారుమతి భర్త అయే వాడికి చెందవలసిందే. ప్రతాపుడు చారుమతికి తగిన భర్త అన్నదే జయదేవుడు తేల్చుకోవలిసి ఉండింది. అది ద్వంద్వ యుద్ధం ద్వారా తేలింది," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# తనకుమాలినధర్మం

పూర్వం పర్షియాదేశంలో దిముష్క అనే నగరాన్ని ఒక పాదుషా పాలిస్తూ ఉండే వాడు. ఒకసారి పొరుగు దేశపురాజు అకార ణంగా అతనిపై దండెత్తి వచ్చాడు. ఈ యుద్ధంలో తనకు జయం లభించినట్టయితే తన దేశంలోని భక్తులందరికీ బంగారు పుష్పాలూ, బంగారు ఫలాలూ దానం చేస్తా నని పాదుషా మొక్కుకున్నాడు.

యుద్ధంలో పాదుషా కోరినట్టే విజయం లభించింది. ఆ సంతోషంతో పాదుషా తన ఖజానాలో ఉన్న బంగారమంతా కరిగించి బంగారు పుష్పాలూ, ఫలాలూ తయారు చేయించమని ఉత్తరువిచ్చి, తన వజీరుతో, "బంగారు ఫల పుష్పాలు స్వీకరించటానికి దేశంలో ఉండే భక్తులందరికీ అహ్వానాలు పంపండి," అన్నాడు.

"చిత్తం, అలాగే పంపుతాను," అన్నాడు వజీరు వినయంగా.

ఈ వజీరు ఎంతో వివేకమూ, లోక జ్ఞానమూ కలవాడు. ఈ దానధర్మాలతో ఖజానా ఖాళీ అవుతుందని అతనికి తెలుసు. ఖజానా ఖాళీ కాగానే పొరుగుదేశపు రాజు మళ్ళీ సైన్యాలను తరలించుకుని యుద్ధా నికి వచ్చి, ఈసారి అవలీలగా తన పాదుషాను జయిస్తాడు.

అందుచేత ఏదో ఒక ఉపాయంతో, పాదుషా తలపెట్టిన ఈ తనకుమాలిన ధర్మ కార్యాన్ని సాగకుండా చేయాలని వజీరు నిశ్చయించుకున్నాడు.

రెండు మూడు రోజులు గడిచాక వజీరు పాదుషాను దర్శించి, "మహాప్రభూ, దేశం అన్ని మూలలా గాలించాను. ఒక్క భక్తు డైనా కానరాలేదు," అని విన్నవించు కున్నాడు.

"ఏమివింత! నువ్వు భక్తుల కోసం సరిగా ప్రయత్నంచేశావా? నాకు తెలిసి మన

షేక్ అబ్దుల్ వహాబ్



దేశంలో వెయ్యిమంది భక్తులున్నారుగదా!" అన్నాడు పాదుషా.

"మహాప్రభూ, నిజమైన భక్తులు మీ బంగారాన్ని పరిగ్రహించరు; పరిగ్రహించే వారు భక్తులుకారు," అన్నాడు వజీరు.

పాదుషా నవ్వి, "నేను తలపెట్టిన ఈ దానాలు మీకు సమ్మతం కానట్టుంది. కాని మీరన్నది ఎంతమాత్రమూ నిజం కాదు. పరిగ్రహించేవారు భక్తులు కారని నిరూపించండి," అన్నాడు.

"చిత్తం, అలాగే," అన్నాడు వజీరు.

"మన నగరానికి ఉత్తరంగా ఉన్న ఎడారిలో గొప్ప తపస్వి ఒకడు నివసిస్తున్నాడు. ఎంతో కాలంగా ఆకులూ, అలములూ తిని అతను జీవిస్తున్నాడు. అతను భక్తుడు కాడని మీరు నిరూపించాలి," అన్నాడు పాదుషా.

అందుకు వజీరు సమ్మతించాడు.

పాదుషా మౌల్వీని వెంటబెట్టుకుని ఎడారిలో ఉన్న తపస్వి వద్దకు వెళ్ళాడు. తపస్వి ప్రార్థన చేసుకుంటున్నాడు. ప్రార్థన ముగియగానే పాదుషా అతనితో, "మహాత్మా, మీ కభ్యంతరం లేనిపక్షంలో మీరు మా నగరానికి దయచేయాలి. అక్కడ మీకొరకు ఒక ఆశ్రమాన్ని నిర్మిస్తాము. మీ తపస్సుకు అవసరమైన సౌకర్యాలన్నీ అమర్చుతాము. మీరు దేనికోసమూ శ్రమపడనవసరం ఉండదు. మీ తపస్సు నిరంతరాయంగానూ, నిర్విఘ్నంగానూ కొనసాగుతుంది. తమ సత్ప్రవర్తన సామాన్య ప్రజలకు అనుసరణీయంగా కూడా ఉంటుంది," అన్నాడు.

పాదుషా అన్న మాటలు తపస్వికి ఏమాత్రం రుచించలేదు. అతను పెడముఖం పెట్టాడు.

అప్పుడు మౌల్వీ అతనితో, "మహాత్మా. పాదుషావారి కోరికను తోసిపుచ్చకండి. మహమ్మద్ ప్రవక్త ఆచారానికి అది వ్యతి

రేకం కాదని మీకు తెలుసు. ఆశ్రమం మీకు అనుకూలంగా లేనిపక్షంలో మీ ఇష్టప్రకారం చెయ్యవచ్చు," అన్నాడు.

ఆ మాటలు విన్న మీదట తపస్వి నగరానికి రావటానికి అంగీకరించి, పాదుషా వెంట వచ్చేశాడు.

తపస్వికి పాదుషావారి ఉద్యానంలోని సొంత మహలులో బస ఏర్పాటయింది. మహలు ఇంద్ర భవనంలా, ప్రశాంతంగా ఉన్నది. అతనికి పరిచర్యలు చేయటానికి అప్సరసలలాటి ఇద్దరు దాసీలను వజీరు నియమించాడు.

తపస్వికి క్రమంగా ఈ జీవితంలో మాధుర్యం కనబడింది. రుచిగల ఆహారమూ, అందమైన బట్టలూ, మధురమైన భక్ష్యాలూ, అత్తరులూ ఆయనకు అలవాటయాయి. శరీరానికి ఉండిన నల్లకప్పు వదిలి, నిగనిగా మెరుస్తూ, ఎర్రగా తయారయింది. పరిచారికల సౌందర్యం అతన్ని ఆకర్షించసాగింది. వారి ముంగురులు అతని మనస్సుకు సంకెళ్ళయాయి.

తన ఎత్తు పారినందుకు వజీరు సంతోషించాడు. ఒక రాత్రి అతను పాదుషాను వెంటపెట్టుకుని రహస్యంగా ఆశ్రమానికి వచ్చాడు.

తపస్వి బంగారు నగిషీలు గల పట్టు దిళ్ళపై చేరబడి పరిచారికలతో సరాగాలాడుతూ పాదుషాకు కనిపించాడు.

"చూశారా, మహారాజా, ఎంతటి మహాత్ముడు ఎలా దిగజారిపోయాడో! భక్తులకు బంగారమిచ్చి వారిని భగవంతుడికి దూరం చేసినవాళ్ళమవుతాము. అందుచేత భక్తులకు ధర్మసత్రాలు ఏర్పాటు చేసి వారిని భక్తులుగానే ఉండనివ్వటం మంచిది," అని వజీరు పాదుషాకు హితం చెప్పాడు.

వజీరు సలహా మేరకు పాదుషా సువర్ణ దానాలు కట్టిపెట్టి, దేశంలో ధర్మశాలలు ఏర్పాటు చేశాడు.



# ఊడిన ఉద్యోగం

ఒక రాజుగారి దగ్గర ఉద్యోగం చేసి ఒక పెద్దమనిషి, ఎడాపెడా లంచాలు పట్టి అంతులేని డబ్బు గడించాడు. అందుచేత అయన ఏ పూటా ఆరుకూరలు లేందే భోజనం చేసేవాడుకాదు.

కాలం ఎప్పుడూ అనుకూలించదు. ఈ పెద్దమనిషి లంచగొండితనం తెలిసి రాజుగారు అతన్ని కొలువులో నుంచి తొలగించాడు. ఇక ఆ పెద్దమనిషి తన పాత సంపాదన మీదనే జీవించవలసిన వాడైనాడు. అందుకని అతను వంటవాణ్ణి పిలిచి, "నా ఉద్యోగం పోయింది. అందుచేత రేపటి నుంచీ రెండు కూరలు చెయ్యి, చాలు," అన్నాడు.

మర్నాటి నుంచీ ఆయన విస్తట్లోకి రెండు కూరలే వస్తూ వచ్చాయి. అయినా తిండి ఖర్చు ఏ మాత్రమూ తగ్గలేదు, పూర్వం లాగే ఉంటున్నది. దీనికి కారణం కనుక్కుందామని ఆయన వంటఇంట్లోకి వెళ్ళేసరికి అక్కడ పూర్వం లాగే ఆరు కూరలూ వండి ఉన్నాయి.

"రెండు కూరలు చాలునని నా ఉద్యోగం పోయిననాడే చెబితినే. ఆరు కూరలు చేస్తున్నావేం?" అన్నాడాయన.

"మీ ఉద్యోగం పోయింది. మీకు రెండు కూరలే వడ్డిస్తున్నాను. నా ఉద్యోగం ఇంకా పోలేదు గనక నేను ఆరు కూరలూ చేసుకు తింటున్నాను," అన్నాడు వంటవాడు.

ఆ రోజే వంటవాడికి ఉద్యోగం పోయింది. —కె. వెంకటేశ్వర్లు





# గుడ్డివాడి డబ్బు

ఒక గ్రామంలో ఒక సాలె ఉండేవాడు. అతను రకరకాల బట్టలు నెయ్యటంలో మంచి నిపుణుడు. ఊళ్ళో వాళ్ళ ఒత్తిడి అంతగా లేనప్పుడు ఖరీదైన శాలువలు నేసి, నగరానికి తీసుకుపోయి అమ్ముతూండే వాడు.

ఒకసారి సాలె ఒక అందమైన శాలువ నేసి, దాన్ని ఒక సంచిలో పెట్టుకుని రాజధానీ నగరానికి బయలు దేరాడు దూరప్రయాణం ; కొండలూ, గుట్టలూ దాటి వెళ్ళాలి. ఒక రోజు అతను నదీ తీరాన్ని చేరుకునేసరికి ఒక పక్కనుంచి, "గుడ్డివాడి డబ్బు! నీటిలో పడిపోతోంది!" అన్న కేక వినిపించింది.

ఆ కేక విని సాలె నది ఒడ్డుకు పరిగెత్తాడు. అక్కడ ఎవరూ లేరు, కాని నది ఒడ్డు పెళ్ళ వరదనీటికి విరిగి పడిపోతూ ఉండటమూ, ఆ పెళ్ళలో ఒక పాతకాలపు చెంబు ఉండటమూ అతని కంట పడింది. సాలె ఆ చెంబును పడి పోకముందే అందుకున్నాడు. ఆ చెంబులోపల కళ్ళు మిరుమిట్లు గొలుపుతూ బంగారు కాసులున్నాయి. వాటిని చూసి సాలె పరమానంద భరితుడైనాడు. అతను చెంబుమూతికి రేకు అడ్డం పెట్టి, వాసెన కట్టి, తన సంచీలో నుంచి శాలువ తీసి భుజాన వేసుకుని, ఆ సంచీలో చెంబు ఉంచి, ఇంటి ముఖం పట్టాడు.

అతను ఒక గ్రామం చేరేసరికల్లా చీకటి పడింది. ఆ రాత్రి ఆ గ్రామంలోనే గడిపి, మర్నాడు బయలుదేరి తన గ్రామానికి పోవచ్చు ననుకుని, అతను ఒక ఇంటి తలుపు తట్టాడు. ఒక ముసలిది తలుపు తెరిచి, "ఎవరు, నాయనా? ఏం కావాలి నీకు?" అని అడిగింది.

"ఈ రాత్రికి మీ వసారాలో పడుకోనివ్వండి. భోజనం కూడా పెట్టారంటే ఒక రూపాయి యిస్తాను," అన్నాడు సాలె.

ఎం. కామేశ్వరరావు

"దాని కేం భాగ్యం, నాయనా?" అని ముసలిది సాలె దగ్గిర ఒక రూపాయి తీసుకుని, అతనికి భోజనం పెట్టి, వసారాలో పడుకో నిచ్చింది.

అంత బంగారం తెల్లవార్లూ తన వద్దనే ఉంచుకుంటే ఎవరైనా కాజెయ్యవచ్చు ననుకుని, సాలె ముసలిదాన్ని పిలిచి, "ఈ చెంబులో ఆమదం ఉన్నది. దీన్ని లోపల జాగ్రత్తగా ఉంచండి. నేను రేపు ఉదయం వెళ్ళిపోయేటప్పుడు ఇద్దురుగాని," అన్నాడు.

"అలాగే, నాయనా," అని ముసలిది అతని చెంబును తీసుకుపోయి, లోపల భద్రంగా దాచింది. తరవాత ఆమె తలుపు వేసుకుని పడుకున్నది.

తలవని తలంపుగా ఆ రాత్రే ముసలిదాని కుమార్తెకు పురుడు వచ్చింది. ఇంట్లో ఆమదం కోసం చూస్తే కనిపించ లేదు. అయిపోయినట్టున్నది. వసారాలో పడుకున్న మనిషి ఇచ్చిన చెంబులో ఆమదం ఉంటుందన్న విషయం ముసలిదానికి గుర్తు వచ్చింది. ఆమె సంచీలో నుంచి చెంబు పైకి తీసి, కట్లు విప్పి, రేకు మూతతీసి చూస్తే బంగారు కాసులు కనబడి కళ్ళు చెదిరిపోయాయి. పిల్లాడు భూమి మీద పడ్డ వేళా విశేషం కదా అనుకుని ముసలిది



ఆ కాసులన్నీ తీసి భద్రం చేసింది. దొడ్డి దారిన వెళ్ళి పొరుగింటి వాళ్ళను లేపి, ఒక శేరు ఆమదం అరువు తీసుకుని, చెంబులో పట్టినంత పోసి, దానికి మూత పెట్టి, వాసెన కట్టి సంచీలో ఉంచి, మిగిలిన ఆమదాన్ని అవసరానికి ఉపయోగించుకున్నది.

సాలెమనిషి మర్నాడు నిద్రలేచి, ముసలి దాన్నడిగి తన సంచీ తాను తీసుకుని, తిన్నగా ఇంటికి వెళ్ళిపోయాడు.

భార్య అతని భుజాన శాలువా చూసి, "అది అమ్మకుండానే తిరిగి వచ్చావేం?" అని అడిగింది.

"ఆ తలుపు వెయ్యావే! ఎంత బంగారం తెచ్చానో చూద్దువు గాని!" అంటూ సాలెమనిషి సంచీనుంచి చెంబు పైకి తీసి, మూతతీశాడు. చెంబు నిండా ఆమదం!

"ముసలిముండ ఎంత పని చేసిందీ. ఇది దానిపనే. అది తప్ప ఇంకెవరూ ఈ చెంబును తాకలేదు," అంటూ అతను భార్యకు జరిగినదంతా చెప్పి, "నే నిప్పుడే వెళ్ళి ఆ ముసలిదాని అంతు తేల్చుకొస్తాను," అని, తాను క్రితం రాత్రి మజిలీ చేసిన గ్రామానికి బయలుదేరాడు.

ముసలిది సాలెవాణ్ణి చూసి, "ఏం, నాయనా, మళ్ళీ వచ్చావు? ఏమైనా మరిచి



పోయావా ఏమిటి? లేక ఈ రాత్రికి కూడా ఇక్కడే పడుకుంటావా?" అన్నది.

"నా దగ్గిర ఇంకో బంగారు కాసులమూట ఉన్నదని ఆశపడుతున్నావా?" అన్నాడు సాలె కసిగా.

"బంగారు కాసులేమిటి, నాయనా?" అన్నది ముసలిది అమాయికంగా.

"అవును, పాపం! నీ కేమీ తెలీదు! నా చెంబులో కాసులన్నీ కాజేసి అందులో అమదం పోసిన దానివి నువుకాదూ?" అన్నాడు సాలె.

"ఆ చెంబులో అమదం ఉందని నువ్వన్నమాటేగా? ఇప్పు డందులో కాసు లున్నాయని నాకు దొంగతనం అంటగట్టు తున్నావా? కాస్త మాటలు జాగర్తగా రానీ!" అని ముసలిది గొంతెత్తింది.

చుట్టుపక్కల వాళ్ళు పోగయారు. అందరూ ముసలిదాన్నే సమర్థించారు. వాళ్ళలో కొందరు, "నీకు చెంబునిండా కాసు లెక్కడివి? చెంబులో కాసులుపెట్టి అమదమని ఎందుకు అన్నావు? నీ వాలకం చూస్తే దొంగలాగున్నావే!" అని ఎదురు డబాయించారు.

తనకు ఎలాంటి సాక్ష్యమూ లేనిచోట న్యాయం జరగదని సాలె అనుకుంటూండగా ఒక స్త్రీ అతనితో, "చూడు, నాయనా! అసలే గుడ్డిమనమడు పుట్టాడని ఏడుస్తున్న ఆ ముండమీద దొంగతనం కూడా ఎందుకు పెడతావు?" అన్నది.

సాలె నిర్ఘాంతపోయాడు. తాను పడుకున్న రాత్రే ముసలిదాని కూతురు ప్రసవించిందనీ, పుట్టిన పిల్లవాడు పుట్టు గుడ్డి అనీ నలుగురూ అన్నమాటలను బట్టి తెలిసింది.

"ఇకనేం? ఆ బంగారం ఈ గుడ్డివాడిదే అయి ఉండాలి. నేను ఆ డబ్బు వాడికి అందజేయటానికే వినియోగ ఒడాను," అనుకుని సాలె ఇంటిదారి పటాడు.






# పీడ విరగడ

పూర్వం గ్రీసుదేశంలో ఒక రాజకుమారు డుండేవాడు. అతను ఎవరెంత చెప్పినా పెళ్ళాడ నిరాకరించాడు. "కాబోయే రాజువురా, బాబూ. పెళ్ళి చేసుకు తీరాలి," అని రాజు చెప్పి చూశాడు. "పిల్లల గదులు బోసిపోతున్నాయి. పెళ్లి చేసుకోరా," అని తల్లి చెప్పి చూసింది. ససేమిరా అన్నాడు రాజకుమారుడు.

రాణి ఆలే ఆలోచించింది. తన కొడుకు ఏ కాపుపిల్లనో ప్రేమించి ఉంటాడు. అందుకే ఆ మాట పైకి అనటానికి భయ పడుతున్నాడు. ఏ కులమైతే నేం? పిల్ల అందగత్తె, బుద్ధిమంతురాలూ అయితే చాలు ననుకున్నది రాణి.

రాజుగారింటికి ఎదురుగా ఒక కాపు వాడిల్లున్నది. ఇంటికి చుట్టూ తోట ఉన్నది. ఆ తోటలో ముగ్గురు ఆడపిల్లలు బంతి ఆడుతూండటం రాణి కంట పడింది. ముగ్గురు పిల్లలూ చక్కని చుక్కలే. తన కొడుకు వారిలో ఎవతెను ప్రేమించినా ప్రేమించి ఉండవచ్చు.

రాణి పెద్ద పిల్లను పిలిపించి, "అమ్మాయీ, మా అబ్బాయి నిన్ను ప్రేమిం చాడేమో నని అనుమానంగా ఉంది. అదే నిజమైతే నిన్ను కోడలుగా చేసుకోవటానికి నా కేమీ అభ్యంతరం లేదు," అన్నది.

ఆమె ఆ పిల్లను రాజకుమారుడి గదికి తీసుకుపోయి, సోఫాలో కూర్చోబెట్టి వెళ్లి పోయింది. కొంతసేపటికి రాజకుమారుడు ఆ గదిలోకి వచ్చాడు. అతను ఆ పిల్ల కేసి చూడనైనా చూడక, బల్ల దగ్గిర కూర్చుని కాస్సేపు ఏదో రాసుకుని గది నుంచి బయటికి వెళ్లిపోయాడు.

రాణి ఏమంటుందో నని కాపుపిల్ల అక్కడే కూర్చుని, ఆవలించి, ఆ సోఫా లోనే నిద్రపోయింది.

గ్రీకు జానపద కథ



ఆ పిల్ల నిద్ర లేచేసరికి తెల్లవారింది. రాణి పక్కనే నిలబడి, "ఏం జరిగిందే, అమ్మాయి?" అని అడిగింది.

"యువరాజుగారు వచ్చారు, ఏదో రాసుకున్నారు, వెళ్లిపోయారు; నాతో మాట్లాడనైనా లేదు," అన్నది కాపుపిల్ల.

రాణి ఆ పిల్ల కేదో బహుమాన మిచ్చి పంపేసి, ఆ రోజు రెండో పిల్లను పిలిపించింది. రెండో పిల్లకు కూడా పెద్దదాని అనుభవమే అయింది. రాజకుమారుడు ఆమె కేసి చూడలేదు, ఆమెను పలకరించలేదు.

మూడో రోజు రాణి మూడో పిల్లను పిలిపించి, మిగిలిన ఇద్దరికీ చెప్పినట్టే చెప్పింది.

ఈ పిల్ల చురుకైనది. ఆమె రాణితో, "ఈ బట్టలతో నేను యువరాజుగారి కంట పడటం బాగుంటుందా?" అన్నది.

రాణి ఆ పిల్లకు రవ్వలు పొదిగిన దుస్తులు కట్టబెట్టి, "ఎంత అందంగా ఉన్నావే! నిశ్చయంగా నువు నా కోడలి వవుతావు!" అని మెచ్చుకున్నది.

"అంతకన్న కూడా విడ్డూరాలు జరగవా?" అన్నది కాపుపిల్ల.

ఆమె గదిలో సోఫా మీద కూర్చుని ఉండగా రాజకుమారుడు గదిలోకి వచ్చాడు; ఆమె కేసి చూడనైనా చూడకుండా, బల్ల ముందు కూర్చుని, మైనంవత్తి వెలిగించి, ఏదో రాసుకోసాగాడు. గదిలో ఒక పక్క మైనాపక్షి ఒకటి నిద్రపోతున్నది.

"యువరాజుగారికి శుభం కలగాలి!" అన్నది కాపుపిల్ల.

యువరాజు జవాబు చెప్పక, రాతలో నిమగ్నుడయాడు.

"ఏం, మైనా? నువ్వన్నా పలుకుతావా?" అన్నది కాపుపిల్ల.

తల రెక్క చాటున పెట్టుకుని నిద్రపోతున్న మైనా మాట్లాడలేదు.

"కొవ్వొత్తీ, కొవ్వొత్తీ! నువ్వైనా మాటకు మాట చెబుతావా?" అన్నది కాపుపిల్ల.

రాజకుమారుడు కలం కింద పెట్టి, "కొవ్వొత్తీ, కొవ్వొత్తీ! నీ కేం కావాలి, కొవ్వొత్తీ?" అన్నాడు చిరాకుగా. అతను ఆ చిరాకులోనే లేచి, ఆమె కేసి చూడకుండానే గది నుంచి వెళ్ళిపోయాడు. కాపుపిల్ల సోఫా మీదనే పడుకుని నిద్రపోయింది.

మర్నాడు తెల్లవారుతూనే రాణీ వచ్చి, కాపుపిల్లను, "ఏం జరిగిందే, అమ్మాయి?" అని అడిగింది.

"ఏముంది మహారాణీ? యువరాజుగారు వచ్చారు. నన్ను పలకరించి, ఎవరు తెచ్చారని అడిగారు. మీరే నని చెప్పాను. సోఫా మీద కూర్చుని, నా చెయ్యి తన చేతిలోకి తీసుకుని, చాలా విషయాలు మాట్లాడారు," అన్నది కాపుపిల్ల.

రాణి పరమానందభరితురాలై, ఆ పిల్లను మరొక రోజు కూడా ఉండి పొమ్మని కోరింది. కాపుపిల్ల రవ్వల దుస్తులు ధరించి, రాజభవనపు గవాక్షం దగ్గిర కూర్చున్నది.

ఆమె అక్కలు గవాక్షం కిందికివచ్చి, "నువ్వు ఇంటికి రావుటే?" అని అడిగారు.

"రాను. మహారాణిగారు నన్ను రానివ్వరు," అన్నది చెల్లెలు.

"ఏమిటి? యువరాజుగారు నిన్ను పలకరించాడా?" అని వాళ్ళు మళ్ళీ అడిగారు.





"ఓ, ఎన్నో విషయాలు మాట్లాడు కున్నాం," అన్నది చెల్లెలు.

అక్కలకు అసూయ పుట్టుకొచ్చింది. "దొంగది, అబద్ధాలాడుతున్నది," అనుకున్నారు వాళ్ళు. వాళ్ళు ఒక వర్తకుడి దగ్గిర ముత్యాలచేరు ఒకటి తెచ్చి, "ఇది అమ్మకాని కొచ్చింది. దీన్ని యువరాజుగారు నీకు కొని పెడతారంటావా?" అని అడిగారు.

"ఇవ్వండి. ఆయన్ని కనుక్కొని చెబుతాను," అన్నది చెల్లెలు.

ఆ రాత్రి రాజకుమారుడు గదిలోకి వచ్చినప్పుడు ఆమె, "కొవ్వొత్తీ, కొవ్వొత్తీ! మా అక్కలు ముత్యాలచేరు తెచ్చారు. కొననా, మానానా?" అన్నది.

రాజకుమారుడు రాసుకుంటూనే, "కొవ్వొత్తీ, కొవ్వొత్తీ! బీరువాలో తాళాలున్నాయి. సొరుగులో కాసులున్నాయి. కావలిసింది తీసుకో!" అన్నాడు. ఈ మాట అని అతను లేచి, ఆమె కేసి చూడకుండానే బయటికి వెళ్ళిపోయాడు.

ఆమె లేచి వెళ్ళి, సొరుగు తెరిచి, గుప్పెడు బంగారు కాసులు తీసుకున్నది. మర్నాడు ఆమె రాణితో, ముత్యాలు కొనటానికి రాజకుమారుడు తనకు డబ్బిచ్చినట్టు చెప్పింది. రాణి మరింత సంతోషించి, కాపుపిల్లను ఇంకో రోజు ఉండిపొమ్మన్నది.

కాపుపిల్ల తన అక్కలను పిలిపించి, బంగారం ఇచ్చి ముత్యాల వర్తకుడికి ఇవ్వమన్నది.

"టక్కరిముండ! ఆ బంగారం రాణి ఇచ్చి ఉంటుంది," అనుకున్నారు అక్కలు.

"నువు నిజంగా యువరాజుగారిని పెళ్ళాడబోతున్నావుటే?" అని పెద్ద అక్క అడిగింది.

"అంతకన్న కూడా విడ్డూరాలు జరగవా?" అన్నది చెల్లెలు.



"నువు ఈ రాజభవనంలోనే పాతుకు పోయి యువరాజును పెళ్ళాడబోతు న్నప్పుడు, ఒకసారి మమ్మల్నిద్దరినీ భోజనానికి పిలిచి, మాకు మా మరిదిగారిని పరిచయం చెయ్యగూడదా?" అన్నారు అక్కలిద్దరూ.

"ఇవాళ రాత్రి అడిగి చూస్తాను. ఆయన సరేనంటే అలాగే చూద్దాం," అన్నది చెల్లెలు.

కాని వాళ్ళు వెళ్ళిపోయాక ఆమె ఏడుస్తూ కూర్చున్నది. ఆమె రోజల్లా ఏడుస్తూనే ఉన్నది. రాజకుమారుడు గదిలోకి వచ్చేసరికి ఆమె ఏడుపు ఏ మాత్రమూ తగ్గలేదు.

"కొవ్వొత్తీ! అయ్యో నా కొవ్వొత్తీ!" అని ఆమె ఏడిచింది.

"ఇలా రా, కొవ్వొత్తీ. ఎందుకా ఏడుపు?" అన్నాడు రాజకుమారుడు రాసుకుంటూనే.

ఆమె అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళి అతని బల్ల పక్కనే నిలబడింది. అతను తల ఎత్తలేదు.

"కొవ్వొత్తీ! నాకు పెద్ద చిక్కొచ్చి పడింది. నా అక్కలు భోజనానికొస్తామంటున్నారు. రమ్మనే అధికారం నాకు లేదు. నేనిక్కడ చెప్పినట్టు చేసే బానిసను. నా అక్కల ముందు నాకు తలవంపులవుతున్నందుకు ఏడుస్తున్నాను," అన్నదామె.

అతను రాసుకుంటూనే, "చెరువులో బాతులున్నాయి. అడవిలో లేళ్ళున్నాయి. దివాణంలో వేటగాళ్ళున్నారు. వండిపెట్టటానికి వంటవాళ్ళున్నారు. విందు చెయ్యి, కొవ్వొత్తీ!" అన్నాడు.

ఇలా అని అతను కలం అవతల పెట్టి, బయటికి వెళ్ళిపోయాడు.

ఈ మాట రాణితో చెబితే ఆమె విందుకు అనుమతించింది. కాపుపిల్ల విందుకు



ఉత్తరు విచ్చి, అక్కలకు ఆహ్వానం పంపింది. అయినా అందువల్ల సమస్య తీరలేదు. రాజకుమారుడు వారి వెంట కూర్చుని భోజనం చెయ్యడు. తన అక్కల సరసన రాజకుమారుడు కూర్చుని భోజనం చెయ్యకపోవటానికి ఏదో సాకు కల్పించాలి, ఒక నాటకం ఆడాలి. అందుకు తగిన ఏర్పాటంతా కాపుపిల్ల ముందుగానే చేసింది.

అక్కలు ఉన్నంతలో మంచి దుస్తులు ధరించి భోజనానికి వచ్చారు. యువరాజు జాడ లేదు. అక్కలకు అనుమానంగానే ఉన్నది. రాణికి మటుకు తన కొడుకు పెళ్ళి దగ్గిరపడుతున్నట్టే అనిపించింది.



"యువరాజుగారు రావటం లేదా ఏం?" అని రెండో అక్క అన్నది.

"వస్తారు. వేటకు వెళ్ళారు. వచ్చేవేళ అయింది," అన్నది చెల్లెలు.

మరి కాస్సేపటికి బయట గుర్రపు డెక్కల చప్పుడు వినిపించింది. ఆ చప్పుడు చేసినవాడు ఆమె నియోగించిన నౌకరు కుర్రాడు. వాడే పైకి వచ్చి, కాపుపిల్లతో, "యువరాజుగారు తమర్ని ఒక్క క్షణం కిందికి రమ్మన్నారు. తమకు ఏదో చెప్పాలిట!" అన్నాడు.

కాపుపిల్ల కిందికి దిగి వెళ్ళింది. అక్కడ రాజకుమారుడు లేడు. అతను ఎక్కడ ఉంటాడో ఆమెకు తెలీదు. తాను ఏం చెయ్యాలో ఆమెకు పాలు పోలేదు. కిందికి దిగిపోయిన మనిషి మరింత కిందికి దిగి నేలమాళిగల లోకి వెళ్ళింది. అక్కడ ఆమె వెర్రిగా తిరుగుతుండగా ఒక చోట ఆమె కాలి కింది రాతిపలక ఒకటి కదిలింది. ఆమె దాన్ని ఎత్తి చూసింది. ఆ పలక కింద మెట్లున్నాయి. ఆమె ఆ మెట్ల వెంబడి, చీకట్లో తడువుకుంటూ దిగిపోయింది. మెట్ల దిగువన ఒక నడవ ఉన్నది. దాని వెంబడి వెళితే ఒక కొట్టం కనిపించింది. దాని నేల అంతా పలేరు



పాకి ఉన్నది. ఆ పల్లేరు మీద పడుకుని రాజకుమారుడు ఒళ్ళు తెలియని నిద్రలో ఉన్నాడు. అతని పక్కనే ఒక స్త్రీ నిద్ర పోతున్నది. ఆమె మానవ స్త్రీ కాదు, జల దేవతలజాతిది. ఇద్దరి మధ్యా ఒక బిడ్డ పడుకుని ఉన్నది. ముగ్గురి తలల నిండా పల్లేరున్నది.

ఈ దృశ్యాన్ని ఒక్క క్షణంపాటు చూసి కాపుపిల్ల గబగబా మెట్లెక్కుతూ భవనం పై అంతస్తుకు వచ్చేసింది. ఆమె రాణీతో, "యువరాజుగారు ఎవరి బిడ్డకో జాతకర్మ జరిపించబోతున్నారట; మూడు జరీ అంచుల పట్టు వస్త్రాలూ, బిడ్డకు ఒక మఖ్మల్ దిండూ, ఒక వెండి దువ్వెనా తెమ్మంటున్నారు. వారు రావటానికి ఆలస్య మవుతుందట. మనని భోజనాలు చేసెయ్య మన్నారు," అన్నది.

తమ చెల్లెలు మోసం చేస్తున్నదని అక్కలకు రూఢి అయింది. రాణి మటుకు అవతలికి వెళ్ళి, కాపుపిల్ల అడిగిన వన్నీ తెచ్చి ఇచ్చింది. వాటిని తీసుకుని ఆమె తిరిగి మెట్లు దిగి వెళ్ళి, కొట్టం చేరు కున్నది. ఆమె నిద్రపోయే బిడ్డను జాగ్ర త్తగా ఎత్తి మఖ్మల్ దిండు పైన పడుకో బెట్టి, దువ్వెనతో ఆ బిడ్డ తల అంతా చక్కగా దువ్వి, ఒక పట్టువస్త్రం కప్పింది.



తరవాత ఆమె దువ్వెనతో యువరాజు తలా, జలదేవత తలా దువ్వి, పల్లేళ్ళు లేకుండా చేసి, వారి పైన కూడా పట్టు వస్త్రాలు కప్పి, తన అక్కలున్న చోటికి తిరిగి వచ్చేసింది. తరవాత అందరూ భోజనాలు చేశారు.

అక్కడ కొట్టంలో జలదేవత నిద్ర లేచి, తమ మీద కప్పి ఉన్న పట్టువస్త్రాలు చూసింది. తన బిడ్డ తల నున్నగా దువ్వి ఉండటం చూసింది. తన తల తడివి చూసుకుని, ఎవరో దువ్వినట్టు తెలుసుకున్నది. ఆమె రాజకుమారుణ్ణి నిద్ర లేపి, "మోసగాడా, ఎవతె నిన్ను ప్రేమిస్తున్నది? ఎవతెను నువు ప్రేమిస్తున్నావు? ఇక్కడికి వచ్చి ఇదంతా చేసిన దెవరు?" అని అడిగింది.

"నన్నెవరూ ప్రేమించినట్టు తెలీదు. నే నెవతెనూ ప్రేమించలేదు. నీ మచ్చు నా మీద పడ్డాక నే నింకొక స్త్రీ ముఖం ఎరగను. నేను కేవలమూ నీ కోసమే జీవిస్తున్నాను," అన్నాడు రాజకుమారుడు.

"ఈ ఆడది ఎవతో తెలుసుకుని రా," అన్నది జలదేవత. తరవాత కొట్టంలో పెద్ద సుడిగాలి తిరిగింది. ఆ గాలిలో జలదేవతా, ఆమె బిడ్డా అదృశ్యమైపోయారు.

రాజకుమారుడు మెట్లెక్కి రాజభవనంలోకి వచ్చేశాడు. రోజల్లా అతనికి పిచ్చి ఎత్తినట్టుగా ఉన్నది. రాత్రి అతను తన గదికి వెళ్ళి, అక్కడ ఏడుస్తూ కూచుని వున్న కాపుపిల్లను చూశాడు. అదే అతను ఆమె కేసి మొదటిసారి చూడటం. ఆమె చాలా అందంగా ఉన్నది.

అతను ఆమె చెయ్యి పట్టుకుని, "ఏడవకు. నువు చూసినది మరెవరికీ చెప్పకు. నన్ను నువే ఆ జలదేవత నుంచి కాపాడావు. మనం మా అమ్మ దగ్గిరికీ, నాన్న దగ్గిరికి వెళ్ళి, రేపే మన పెళ్ళి ఏర్పాటు చెయ్యమని చెబుదాం, పద," అన్నాడు.





# పంచవ్యాఘ్రశూరుడు

కొన్ని వందల ఏళ్ళ క్రితం చీనాదేశంలో ఒక నిరుపేద యువకుడుండేవాడు. అతను కట్టెలు కొట్టి జీవించేవాడు. అతని కొక తల్లి మాత్రం ఉండేది.

ఒక శీతాకాలపు సాయంత్రంవేళ కొండ చరియలో అతను కట్టెలు కొట్టుతూండగా సమీపంలో ఉండిన వెదురుపొద నుంచి బాధను సూచించే మూలుగులాటిది వినిపించింది. వెదురుపొద దట్టంగా ఉండటం చేత లోపల ఎవరున్నదీ కానరాలేదు.

అతను గొడ్డలి భుజాన పెట్టుకుని వెదురు పొదను సమీపించాడు. మూలుగు మరింత గట్టిగా వినిపించిందే గాని లోపల ఉన్నది కనిపించలేదు. అందుచేత అతను అతి జాగ్రత్తగా పొదలోకి ప్రవేశించాడు. జాగ్రత్త దేనికంటే, అది అయిదేళ్ళ క్రితం నరికిన వెదుళ్ళపొద. వెదురు మొదళ్ళు కత్తి కన్న పదునుగా ఉంటాయి, పొరపాటున ఎవరైనా వాటి పైన పాదం మోపితే పాదాన్ని చీల్చేస్తాయి.

కట్టెలు కొట్టేవాడికి పొద లోపల ఒక ఆడపులి కనబడింది. దాని పాదంలోకి వెదురుపేడు లోతుగా దిగబడి పోయింది. ఆ కారణంగా అది కదలలేని స్థితిలో ఉండి, బాధతో మూలుగుతున్నది. మొదట పులిని చూసి భయం కలిగినా, దీనంగా తన కేసి పులి చూసిన చూపులకు కట్టెలు కొట్టేవాడి గుండె ద్రవించిపోయింది.

అతను చప్పున పొద నుండి బయటికి వచ్చి, కొండదిగి, ఇంటికి పరిగెత్తి, "అమ్మా, కొండ మీద ఒక పులి, పాపం, గాయపడి చాలా బాధలో ఉన్నది. దాన్ని కాపాడుదాం, నా వెంట సాయం వస్తావా?" అన్నాడు.

"అలాగా, నాయనా? ఒక్క క్షణం ఉండు. గాయాలకు రాయటానికి మందు తెస్తాను," అన్నది తల్లి.

చీనా జానపద కథ



ఇద్దరూ పులి ఉన్న చోటికి వచ్చారు. తల్లి పులికి ఊరడింపుగా మాట్లాడుతూ ఉంటే, కొడుకు ఉపాయంగా పులి కాలును వెదురు నుంచి పైకి తీశాడు. విమోచనం కలిగిన అనంతరం పులి తన సహజక్రౌర్యం చూపక, తల్లి కొడుకుల కేసి చాలా కృతజ్ఞతతో చూసింది. తల్లి పులికాలిగాయానికి మందు రాచి, చప్పున రెండడుగులు వెనక్కు వేసి, మర్యాదగా సెలవు పుచ్చుకోవటానికి ఏదో అనాలి గనుక, "పులి తల్లీ, మేం పేదవాళ్లం. నా కొడుక్కి ఎవరూ పిల్ల నివ్వకుండా ఉన్నారు. నీ ఎరికన మంచి పిల్ల ఎవత్తె అయినా ఉంటే మావాణ్ణి ఒక ఇంటివాడుగా చేద్దూ, నీకు పుణ్యం ఉంటుంది!" అని కొడుకుతో సహా గబగబా వచ్చేసింది.

ఇంకా శీతాకాలం ముగియకమునుపే ఒక ధనికుడి కుమార్తెను పెళ్ళికూతుర్ని చేసి, సారెతో సహా ఆ కొండప్రాంతాన, కాబోయే అత్తవారింటికి తీసుకు పోతూండటం తటస్థించింది. పెళ్లికూతురు మేనాలో ఉన్నది. ముందూ వెనకా మనుషులు పెట్టెలూ, కావళ్ళూ మోస్తూ వస్తున్నారు.

అకస్మాత్తుగా ఈ పెళ్ళివారు వచ్చేదారికి అడ్డంగా అయిదు పెద్ద పులులు కూర్చుని, కోరలు తెరిచి గుర్రుమంటూ, తోకలు ఆడిస్తూ ప్రత్యక్షమయాయి. కావళ్ళూ, పెట్టెలూ, మేనా అక్కడే పారేసి, వాటిని మోసేవాళ్ళంతా కాలిసత్తువ కొద్దీ పరిగెత్తి, కొండల్లోకి మాయమయారు. పెళ్ళికూతురు మాత్రం కంగారుపడి మేనా తలుపులు తెరుచుకుని బయటికి వచ్చి, తానూ, అయిదు పులులూ తప్ప ఎవరూ లేకపోవటం చూసింది.

ఆ తరవాత ఒక గంటకు కాబోలు, కట్టెలు కొట్టేవాడి ఇంటి తలుపు ఎవరో తట్టారు. ఆ యువకుడు వెళ్ళి తలుపు తీసేసరికి, అందమైన పెళ్ళికూతురు బయట నిలబడి ఉన్నది. ఆమె వెనకగా అయిదు

పులులున్నాయి. అవి మందహాసం చేస్తు న్నట్టుగా కట్టెలు కొట్టేవాడికి అనిపించింది.

త్వరలోనే కట్టెలు కొట్టేవాడు ఆమెను పెళ్ళాడాడు. ఆమె తన భర్తపట్లా, అత్తగారి పట్లా ఎంతో ప్రేమాభిమానాలతో మసులు కున్నది. వాళ్ళకు జీవితం సుఖంగా వెళ్ళి పోతున్నది.

కాని పెళ్ళికూతురు తండ్రికి జరిగిన సంగతి తెలియవచ్చింది. ఆయన ఉండేది కొండ అవతలిపక్క. ఆయన చాలా గొప్ప ధనికుడు, పలుకుబడి కలవాడు కూడా. ఆయన ఆగ్రహించి, కట్టెలు కొట్టేవాడూ, అతని తల్లీ కలిసి తన కుమార్తెను అపహ రించారని న్యాయాధికారి వద్ద ఫిర్యాదు చేశాడు. న్యాయాధికారి కట్టెలు కొట్టేవాణ్ణీ, అతని తల్లినీ న్యాయస్థానానికి రప్పించాడు.

తాను పెళ్ళాడిన పిల్లను తాను దొంగి లించలేదనీ, పులులు తెచ్చి తన ఇంట దిగబెట్టాయనీ చెప్పాడు, వాడు. న్యాయాధి కారి ఈ మాట నమ్మక, "వీడు తప్పు ఒప్పు కునేదాకా కర్రలతో కొట్టండి. నిజం చెప్పని పక్షంలో చచ్చేదాకా కొట్టండి," అని తన భటులను ఆజ్ఞాపించాడు.

అప్పుడు కట్టెలు కొట్టేవాడి తల్లి న్యాయాధికారి కాళ్ళపై పడి, "మావాడు నిజమే చెబుతున్నాడు. కావలిస్తే నేను



వెళ్ళి పులులను సాక్ష్యం తెస్తాను," అన్నది. ఇదంతా న్యాయాధికారికి ఏదో వినోదంగా తోచి, "సరే, సాక్షులను తీసుకురా. అంత దాకా శిక్ష నిలుపుచేస్తాను," అన్నాడు.

ఆమె వెళ్ళి చాలా కొద్ది సేపటిలోనే తిరిగి వచ్చింది. ఆమె వెనకగా వస్తున్న అయిదు పెద్దపులులనూ చూసి, న్యాయ స్థానంలో వాళ్ళంతా పారిపోయారు. న్యాయాధిపతి మాత్రం ఎత్తయిన బల్ల ఎక్కి, వణుకుతూ నిలబడి పులులను చూసి, "మీరేనా—?" అన్నాడు. ఆ పైన ఆయనకు మాట పెగలలేదు.

న్యాయాధికారి అడగ దలిచిన ప్రశ్న అర్థమైనట్టుగా పులులు తమ తలలను పైకీ, కిందికీ ఆడించాయి. విచారణ అయి పోయింది. కట్టెలు కొట్టేవాడు, తన తల్లితో సహా ఇంటికి తిరిగి వచ్చేశాడు.

ఆ యేడే వేసవిలో అనేక వేల సంఖ్యలో ఆటవికులు రాజ్యం మీదికి దండెత్తి వచ్చారు. వాళ్ళ వెంట వేట కుక్కలూ, భల్లూకాలూ, వానరాలూ ఉన్నాయి. చక్ర వర్తి సైన్యాలు యుద్ధానికి తరలి వెళ్ళాయి గాని, యుద్ధ విద్యలేవీ ఆ ఆటవికమూకల మీద పనికిరాలేదు. చక్రవర్తికి ఘోరపరా జయం కలిగేలా కనబడింది. చక్రవర్తికి మతే పోయింది. ఆ సమయంలో ఆయనతో ఎవరో కట్టెలు కొట్టేవాడి పులులను గురించి చెప్పారు. చక్రవర్తి అతన్ని పిలిపించి, "నువు శత్రువులను పారదోలితే నా సేనకు నిన్ను సర్వసేనాని చేస్తాను," అన్నాడు.

యోధులనూ, భేరీలనూ, కవచాలనూ చూసి బెదరని ఆటవికసేన అయిదు పెద్ద పులులను చూడగానే హడలి పారిపోయింది. చక్రవర్తి పరువు దక్కింది. ఆయన కట్టెలు కొట్టేవాణ్ణి శాస్త్రోక్తంగా సర్వసేనానిగా అభిషేకించి, "పంచవ్యాఘ్రశూర" అని బిరుదిచ్చి, పెద్ద జీతం మీద తన వద్ద కొలువు ఉంచుకున్నాడు.





# చిన్న పరీక్ష

ఒక బిచ్చగాడుండేవాడు. వాడు ఊళ్ళ వెంబడి తిరుగుతూ బిచ్చమెత్తుకునేవాడు. ఒకసారి వాడు చాలాదూరం తిండిలేకుండా ప్రయాణంచేసి, ఆకలి దహించుకుపోతూ ఒక ఊరు చేరాడు. అక్కడ వాడి కొక పెద్ద లోగిలి కనబడింది. అంత గొప్పయింట తనకు పట్టెడన్నం దొరకక్కపోదను కున్నాడు బిచ్చగాడు.

సింహద్వారం వద్ద ద్వారపాలకుడు కనిపించాడు.

"అయ్యా! ఆకలితో చచ్చిపోతున్నాను. పట్టెడన్నం పెట్టించండి," అని బిచ్చగాడు ద్వారపాలకుడితో అన్నాడు.

"ఆకలితో చచ్చిపోతున్న వాళ్ళకోసమే మా యజమాని కనిపెట్టుకుని ఉన్నారు. లోపలికిపద." అని ద్వారపాలకుడు బిచ్చగాణ్ణి తీసుకుపోయి యజమానికి చూపించాడు.

"ఏంకావాలి నీకు?" అని యజమాని బిచ్చగాణ్ణి అడిగాడు.

"రెండు రోజులుగా ఒక్క మెతుకు తినలేదు. ఆకలి దహించుకుపోతున్నది. పట్టెడన్నం పెట్టించండి, మీకు పుణ్యం ఉంటుంది," అన్నాడు బిచ్చగాడు.

"తప్పకుండా!....ఎవర్రా అక్కడ? కాళ్ళూ చేతులూ కడుక్కోవటానికి నీళ్ళు పట్టుకురండి. ఈ వసారాలో పీటా, విస్తరీ వెయ్యండి," అని కేకపెట్టాడు యజమాని.

నౌకర్లు వచ్చి వసారా చివర నీళ్ళు ఉంచినట్టూ, ఇవతలగా పీట వాల్చినట్టూ, విస్తరి వేసినట్టూ అభినయం చేసి వెళ్ళిపోయారు. కాని వాళ్ళు నీరుగాని, పీటగాని, విస్తరిగాని తీసుకురాలేదు. అయినా యజమాని, "ఆ చెంబుతో కాళ్ళూ, చేతులూ కడుక్కుని, ఇలా ఈ పీట మీద కూర్చో," అన్నాడు బిచ్చగాడితో.

వి. సుందరరావు

బిచ్చగాడికి ఒక క్షణంపాటు మతిపోయి నట్టయింది. కాని ఆ ఇంటి యజమాని తనతో ఏదో ఆట ఆడుతున్నట్టు తెలుసుకుని, తాను కూడా అందుకు తగినట్టుగానే నటించ నిశ్చయించాడు. వాడు లేని చెంబుతో కాళ్ళూ, చేతులూ, ముఖమూ కడుక్కుని, పోయి ఉత్తుత్త పీట మీద కూర్చున్నాడు.

"ఒరే, ఇతనికి పూరీలూ, లడ్డూలూ, పాయసమూ పట్టుకురండి," అని కేక వేశాడు యజమాని.

నౌకర్లు ఖాళీ పళ్ళాలతో ఏవేవో తెచ్చి బిచ్చగాడి ముందు వడ్డించినట్టు కొంచెం సేపు నటించారు. ఒక ఖాళీగ్లాసు అతని ముందు పెట్టారు.

బిచ్చగాడు అవన్నీ తింటున్నట్టూ, తాగుతున్నట్టూ నటించాడు.

"పూరీలు చాలా బాగున్నాయి. మరి రెండు తెప్పించనా?....ఇతనికి ఇంకా లడ్డూలూ, పాయసమూ వడ్డించండిరా! అంతా వంటగదిలోనే తగలడ్డారా ఏం?" అన్నాడు యజమాని.

బిచ్చగాడు పొట్ట తడువుకుంటూ, "ఇంక వద్దు, బాబూ. ఇప్పటికే కడుపు నిండి పోయింది. ఎంతో భుక్తాయాసంగా ఉంది. పోయే ప్రాణాన్ని నిలబెట్టారు. మీ మేలు మరవను. ఇక వెళ్ళివస్తాను, సెలవిప్పించండి," అన్నాడు.

ఇంతలో గృహస్థు భార్య వచ్చి, "కూర్చో, నాయనా. ఇదంతా ఒక చిన్న పరీక్ష. అసలు భోజనం నేను పెట్టిస్తాను. ఆకలికి ఓర్పుండదని మావారు నాతో ఇంతకు ముందే పందెం వేసి ఓడిపోయారు. నువు చాలా ఓర్పు చూపావు." అన్నది.

ఆమె ఆ బిచ్చగాడికి నిజమైన పూరీలూ, లడ్డూలూ, పాయసమూ కడుపునిండా పెట్టి, అతనికి నిజమైన భుక్తాయాసం తెప్పించి పంపేసింది.





# వ్యత్యాసం

ఒకప్పుడు ఒక రాజు తన రాజ్యాన్ని ధర్మం తప్పకుండా పాలించేవాడు. ఆదర్శప్రాయుడైన రాజుగా ఆయనకు అంతులేని కీర్తి వచ్చింది.

ఒకనాడు ఆ రాజు వేటకు వెళ్ళాడు. వేటతమకంలో ఆయన తన పరివారానికి దూరమై, కీకారణ్యంలో చిక్కుకుని, దారి తప్పి చాలాసేపు తిరిగి, ఆకలిదప్పులతో ఒక ముని ఆశ్రమాన్ని ఎలాగో చేరుకున్నాడు.

ముని కళ్ళు మూసుకుని ధ్యానంలో ఉన్నాడు. రాజు ఆయనకు నమస్కారం చెబుతూ, "దారితప్పి అరణ్యంలో చిక్కుకుని, ఆకలిదప్పులతో అలసి ఉన్నాను. ఇక్కడ కొంచెం సేపు విశ్రాంతి తీసుకునేటందుకు అనుమతిస్తారా?" అని అడిగాడు.

ముని కళ్లు తెరవకుండానే, "అవశ్యం తీసుకోవచ్చు. ఈ దేశాన్ని ఏలే రాజు ధర్మాత్ముడు. అందుచేత ఆకలిదప్పుల భయం లేదు. ఆశ్రమంలో ఏ కాయ తిన్నా, ఏ ఆకు తిన్నా రుచిగానూ, పుష్టికరంగానూ ఉంటుంది. వాటితో నీ ఆకలి, దప్పి తీర్చుకో," అన్నాడు.

రాజు ఆశ్చర్యపడి సమీపంలో ఉన్న చెట్టు కాయ ఒకటి కోసి నోట వేసుకున్నాడు. తియ్యగానూ, రుచిగానూ ఉన్నది. పుల్లగానూ, చేదుగానూ ఉండవలిసిన కాయలూ, ఆకులూ కూడా తియ్యగా ఉండి, రాజును బాధించిన ఆకలిదప్పులు క్షణంలో తొలగిపోయాయి. శరీరంతోబాటు మనసుకూ ఎంతో తృప్తి కలిగింది. రాజు అక్కడే కొంతసేపు విశ్రాంతి తీసుకుని ఇంటికి తిరిగి వచ్చేశాడు.

ఇంటికి వచ్చాక రాజుకు, తన ధర్మపరిపాలనయొక్క మహత్తును లోకానికి తెలపాలని బుద్ధి పుట్టింది. ఆయన తన సామంతులనూ, పెద్ద ఉద్యోగులనూ, పుర

ఎమ్. జయరాం

ప్రముఖులనూ విందుకు పిలిచాడు. విందుకు గాను వేపాకు పచ్చడీ, కాకర కాయలు వేసి పాయసమూ లాంటివి తయారు చేయమని తన వంట వాళ్ళకు ఉత్తరు విచ్చాడు. రాజుగారి ఉద్దేశం ఏదో ఉంటుందనుకుని వంటవాళ్ళు అయన అజ్ఞాపించిన ప్రకారమే వంటకాలు తయారుచేశారు.

అందరితోబాటు రాజుగారు కూడా భోజనానికి కూర్చున్నాడు. అయితే ఆయనకు గొప్ప ఆశాభంగం కలిగింది. తాను చేయించినవన్నీ చేదు విషం! నోట పెడితే వాంతి వచ్చేసింది.

రాజుగారు విందు ఆపు చేయించి, మళ్ళీ వేరే వంట చేయించి, అందరికీ పెట్టించి, తన మానాన్ని కాపాడుకున్నాడు. కాని ఆ నాడు ముని ఆశ్రమంలో ఏది తిన్నా రుచిగా ఎందుకున్నదో, ఈ నాడు అలా ఎందుకు లేదో ఆయనకు అర్థం కాలేదు. వంటవాళ్ళే విందు పాడుకావటానికి కారణమై ఉంటారనుకుని, ఆయన వేపాకూ, కాకరకాయలూ తిని చూశాడు. అవి చేదుగానే ఉన్నాయి. అంటే వంటవాళ్ళ తప్పు లేదన్నమాట.

ఈ వ్యత్యాసానికి కారణం మునినే అడిగి తెలుసుకుందామని రాజు ఆశ్రమానికి వెళ్ళి మునితో జరిగిన సంగతంతా చెప్పి. "ఆ నాడు ఏది తిన్నా రుచిగా ఉన్నది, ఈ నాడు ప్రతిదానికీ దాని మామూలు రుచే ఉండటానికి కారణం ఏమిటి, స్వామీ?" అని అడిగాడు.

"ఆ నాడు నువే రాజువని తెలియక నీ ధర్మశీలతను పొగడాను. దాని మూలంగా నీలో గర్వాతిశయం కలిగింది. నీ మహిమను నువే పరీక్షకు పెట్టావు. మహిమలు అపద్ధర్మంగా కనబడతాయే గాని పరీక్షకు నిలవవు," అని ముని చెప్పాడు. అటు తరవాత రాజు అణకువ తెచ్చుకున్నాడు.






ఈ లోపల ధర్మరాజు భీముడి కోసం అంతటా వెతికాడు. భీముడి జాడ లేదు. దుర్యోధనుణ్ణి అడిగితే, "అప్పుడే నగ రానికి వెళ్ళిపోయాడు," అన్నాడు. ధర్మ రాజు వెంటనే నగరానికి తిరిగి వెళ్ళి, కుంతిని కలుసుకుని, భీముడు వచ్చాడా అని అడిగితే ఆమె రాలేదన్నది.

"వాడు ఒకచోట పడుకుని నిద్రపోవటం చూశాను. మళ్ళీ చూస్తే అక్కడ లేడు. అంతటా వెతికాను. ఎక్కడా కనబడడు. నా ప్రయాస అంతా వృథా. ఏమై పోయాడో?" అన్నాడు ధర్మరాజు.

కుంతికి దుఃఖం వచ్చింది. "నువ్వూ, నీ తమ్ములూ నాలుగు దిక్కులా వాడికోసం వెతకండి, నాయనా," అని ఆమె ధర్మ రాజును పంపేసి, విదురుణ్ణి పిలిపించి, "మిగిలినవాళ్ళతో ప్రమాణకోటిస్థలానికి వెళ్ళిన భీముడు తిరిగి రాలేదు. ధర్మరాజు ఎంత వెతికినా వాడు కనిపించలేదుట. దుర్యోధనుడికి వాడంటే అమిత ఈర్ష్య; వాడి ప్రాణాలు తీశాడో ఏమోనని భయంగా ఉన్నది," అన్నది.

"నాతో అంటే అన్నావు, ఈ మాట మరెక్కడా అనకు. దుర్యోధనుడు పరమ దుర్మార్గుడు. ఈ మాట వింటే వాడు నీ మిగిలిన కొడుకులను బతకనివ్వడు. అది చూసుకో. అయినా భీముడి ప్రాణాల కేమీ భయం ఉండదులే. నీ కొడుకు లందరూ దీర్ఘాయువులు," అని విదురుడు కుంతిని ఊరడించి వెళ్ళిపోయాడు.

7. ద్రోణుడి కథ



67



అక్కడ నాగలోకంలో భీముడు ఎనిమిది రోజులు నిద్రపోయి, మేలుకున్నాడు. అప్పుడు నాగులు అతనితో, "నువు తాగిన దివ్యరసం ఇప్పుడు జీర్ణమయింది. నీ కిక వెయ్యి ఏనుగుల బలం ఉన్నది. గంగలో స్నానం చేసి, నీ తల్లినీ, తోబుట్టువులనూ చేరుకో," అన్నారు.

వాళ్ళు భీముడి చేత గంగలో స్నానం చేయించి, కట్టుకోవటానికి పట్టుబట్ట లిచ్చి, అనేక ఓషదులు చేర్చి తయారుచేసిన పరమాన్నం పెట్టి, అనేక నగలతో అలంకరించారు. తరవాత ఒక నాగుడు భీముణ్ణి ప్రమాణకోటిస్థలంలో ఒక వనానికి



మోసుకు వచ్చాడు. భీముడు తనను సాగనంప వచ్చిన నాగుల వద్ద సెలవు పుచ్చుకుని, హస్తినాపురం చేరి, తల్లికీ, అన్నకూ నమస్కరించి, తమ్ముళ్ళను కౌగలించుకున్నాడు. అతని రాకతో అందరి విచారమూ తొలగిపోయింది.

భీముడు తల్లితో తనను దుర్యోధనుడు చంపాలని విషాహారం పెట్టటమూ, కాళ్ళు చేతులు కట్టి నదిలోకి తొయ్యటమూ, నాగలోకంలో తన అనుభవాలూ చెప్పాడు.

అది మొదలు పాండవులు ఒకరి నొకరు వెయ్యి కళ్ళతో కాపాడుకుంటూ వచ్చారు. దుర్యోధనుడు పాండవులకు ద్రోహం చెయ్యటానికి చేసిన ఆలోచనలను విదురుడు భగ్నం చేస్తూ వచ్చాడు.

కౌరవ పాండవ కుమారులు కృపాచార్యుల వద్ద విలువిద్య నేర్చుకునేటట్టు భీష్ముడు ఏర్పాటు చేశాడు. కుర్రవాళ్ళు కొంత కాలం కృపాచార్యుల వద్ద శిక్షణ పొందిన పిమ్మట భీష్ముడు వారికి గురువుగా ద్రోణాచార్యుణ్ణి ఏర్పాటు చేశాడు.

ఈ ద్రోణుడు భరద్వాజు డనే ఋషికి కొడుకు. అతను పెరిగి పెద్దవాడై వేద వేదాంగాలను పూర్తిగా చదివి, అస్త్రవిద్యలు నేర్చుకోవటానికి అగ్నివేశు డనే వాడివద్ద

శిష్యుడుగా చేరి, ఆగ్నేయాది అస్త్రాలను సంపాదించాడు. అగ్నివేశుడి వద్దనే మరొక శిష్యుడు కూడా ఉండేవాడు. అతను వృషతుడి కొడుకు, ద్రుపదు డనేవాడు. ఇద్దరూ ఒక గురువు దగ్గిర శిష్యులు కావటంచేత ఇద్దరికీ స్నేహం కుదిరింది.

కొంత కాలానికి పాంచాల రాజైన వృషతుడు చనిపోగా, ద్రుపదుడు పాంచాల దేశానికి రాజ్యాభిషేకం చేసుకున్నాడు. ద్రోణుడి తండ్రి అయిన భరద్వాజుడు కూడా పోయాడు. తరవాత ద్రోణుడు కృపాచార్యుడి చెల్లెలయిన కృపి అనే ఆమెను పెళ్ళాడాడు. వారిద్దరికీ అశ్వత్థామ అనే కొడుకు కలిగాడు.

ద్రోణుడు సంసారం ఈదే ప్రయత్నంలో సంపాదన మార్గం చూసుకోవలిసి వచ్చింది. పరశురాముడు బ్రాహ్మణులకు అడిగినంతగా దానాలు చేస్తున్నాడని విని ద్రోణుడు అక్కడకు వెళ్ళాడు. పరశురాముడు ద్రోణుడితో, "నాయనా, నా కున్నదంతా బ్రాహ్మణులకు ఇచ్చేశాను. భూమి అంతా కశ్యపుడి కిచ్చాను. ఇక నా వద్ద అస్త్రాలు తప్ప మరేమీ లేవు," అన్నాడు.

"ఆ అస్త్రాలనే నాకు దయచేయించండి," అన్నాడు ద్రోణుడు.



"పరశురాముడు ద్రోణుడికి తన వద్ద ఉన్న అస్త్రాలన్నీ ఇచ్చేస్తూ, వాటిని ఎలా ప్రయోగించాలో, ఎలా ఉపసంహరించాలో శాస్త్రోక్తంగా చెప్పాడు.

తరవాత ద్రోణుడు, తన పూర్వ స్నేహితుడైన ద్రుపదుడు తనకు సహాయపడతాడనే ఉద్దేశంతో, అతని వద్దకు వెళ్ళాడు. రాజయాక ద్రుపదుడికి కళ్ళు నెత్తి కొచ్చాయి. అతను ద్రోణుణ్ణి చూసి, "నువ్వెవరో నే నెరగను. వెళ్ళు, వెళ్ళు," అన్నాడు.

అవమానం పొందిన ద్రోణుడు హస్తినాపురానికి తిరిగి వచ్చి, తన బావమరిది చాటున అజ్ఞాతంగా ఉంటూ వచ్చాడు.



ఇలా ఉండగా ఒకనాడు కౌరవకుమారులు నగరం వెలపల బంతి ఆడుతూండగా బంతి ఒక బావిలో పడింది. దానిని పైకి తీయటం వారికి సాధ్యం కాలేదు. ఆ సమయంలో ద్రోణుడు వాహ్యాళికి అటుగా వచ్చాడు. కుర్రవాళ్ళు అతని చుట్టూ మూగి, ఎలాగైన బావిలో నుంచి బంతిని పైకి తీసి పెట్టమని బతిమాలారు.

"అబ్బాయిలూ, మీ రందరూ భరత వంశాంకురాలు, అందులోనూ కృపాచార్యుడి శిష్యులు; బావిలో నుంచి బంతిని తీయలేకపోతున్నారా? ఈ నా ఉంగరాన్ని బావిలో వేసి, దాన్నీ, మీ బంతినీ కూడా తీస్తాను, చూసుకోండి," అంటూ ద్రోణుడు తన ఉంగరాన్ని బావిలో వేశాడు.

ధర్మరాజు ద్రోణుడితో, "ముసలి బ్రాహ్మడా, ఈ పని చేశావంటే కృపాచార్యులుగారు నీకు యావజ్జీవం భోజనం ఏర్పాటు చేస్తాడు," అన్నాడు.

"చూస్తూ ఉండండి," అంటూ ద్రోణుడు ధనుర్బాణాలు తీసుకుని, ఒక బాణాన్ని బంతిలో ఇరుక్కునేటట్టు కొట్టాడు; తరవాత వరసగా బాణానికి బాణం తగులుకునేటట్టు చేసి, ఆ బాణాల తాడుతో బంతిని పైకి తీశాడు. పిల్లలందరూ ఆశ్చర్యపోయి, "ఉంగరాన్ని కూడా తియ్యి," అన్నారు.

ద్రోణుడొక బాణాన్ని మంత్రించి కొట్టి ఉంగరానికి తగులుకునేటట్టు చేశాడు. తరవాత, బంతిని లాగినట్టే ఉంగరాన్ని కూడా పైకి లాగాడు.

పిల్లలందరూ ఈ అద్భుతం చూసి దిగ్భ్రమ చెంది, ఒక్కసారిగా ఆయనకు నమస్కారాలు చేసి, "స్వామీ, ఇటువంటి శక్తి మే మెక్కడా చూడలేదు. మీ రెవరు? మా వల్ల మీకేం ఉపకారం కావాలి?" అని అడిగారు.

"మీరు పిల్లలు. నా గొడవ మీ కెందుకు? ఈ సంగతి మీ తాతగారైన భీష్ముడికి



చెప్పండి. నా సంగతి ఆయనే విచారిస్తాడు," అన్నాడు ద్రోణుడు.

పిల్లల ద్వారా భీష్ముడు సంగతంతా తెలుసుకుని, ద్రోణుణ్ణి సాదరంగా నగరానికి ఆహ్వానించి, "మీరు హస్తినాపురానికి రావటానికి కారణమేమిటి?" అని అడిగాడు.

ద్రోణుడు తన పుట్టుపూర్వోత్తరాలు చెప్పి, "మా తండ్రి నన్ను కృపాచార్యుడి చెల్లెలిని పెళ్ళాడమని ఆదేశించి చనిపోయాడు. నేనలాగే చేసి అశ్వత్థామను కన్నాను. తన తోటి వాళ్ళు ఆవుపాలు తాగుతుంటే నా కొడుకు తనకు కూడా ఆవుపాలు కావాలని ఏడ్చాడు. ఆవును సంపాదించటం నాకు సాధ్యం కాక, నీటిలో పిండి కలిపి, అవే ఆవుపాలని ఇస్తే, నా కొడుకు సంతోషంతో తాగుతూ వచ్చాడు. మా ఆశ్రమంలో వాళ్ళు నా బీద స్థితిని చూసి నిందించారు. నాకు నా సహపాఠి అయిన ద్రుపదుడు గుర్తు వచ్చాడు. చిన్నతనంలో అతను తనకు రాజ్యం వస్తే దాన్ని నా కిస్తాననేవాడు. అతని సహాయం ఆశించి పాంచాలదేశం వెళ్ళి, అతనికి మా పాత స్నేహం గుర్తు చేశాను. రాజ్యమదాంధుడై అతను, రాజైన తనకూ, పేద బ్రాహ్మడినైన నాకూ స్నేహమేమిటన్నాడు; నన్ను ఎరగనే ఎరగనన్నాడు; కావలిస్తే ఒక పూట భోజనం పెడతానన్నాడు. నాకు మండిపోయింది. భార్యనూ, కొడుకునూ వెంటబెట్టుకుని ఈ కురుదేశం వచ్చాను. మీరు పిలవనంపగా వచ్చాను. ఏమిటి తమ ఆజ్ఞ?" అన్నాడు.

"మీరు కురుదేశం రావటం మా పిల్లల సుకృతం. మీకు కావలిసిన సుఖాలన్నీ అమరుస్తాను. మిమ్మల్నే రాజుగా భావించి, మీ ఆజ్ఞలు శిరసావహిస్తాము," అని భీష్ముడు కొద్ది రోజుల అనంతరం ఒక నాడు కౌరవ, పాండవ కుమారులందరినీ ద్రోణుడికి శిష్యులుగా సమర్పించాడు.

ద్రోణుడు కుర్రవాళ్ళనందరినీ చేర్చి, "మీకు నేను విలువిద్య చెప్పటం పూర్తి అయినాక నా పని ఒకటి చేసి పెట్టవలిసి ఉంటుంది," అన్నాడు.

ఎవరూ మాట్లాడలేదు. అర్జునుడు మాత్రం, "గురుదేవా, మీరేం చెప్పినా చేస్తాను," అన్నాడు.

ద్రోణుడికి చాలా ఆనందమయింది. ఆయన అర్జునుణ్ణి కౌగలించుకుని, చాలా సార్లు ముద్దాడాడు.

ద్రోణుడి దగ్గిర ధృతరాష్ట్రుడి కొడుకులూ, పాండురాజు కొడుకులూ మాత్రమే గాక, హస్తినాపురానికి వచ్చి ఉన్న యాదవ కుమారులు కూడా శిష్యులుగా చేరి విలువిద్య నేర్చుకున్నారు.

సూతుడి ఇంట పెరిగిన కర్ణుడు కూడా ద్రోణశిష్యుడయాడు.

అప్పటి నుంచి కూడా కర్ణుడికి దుర్యోధను డంటే అభిమానం; అవకాశం దొరికి నప్పుడల్లా పాండవులను హేళన చేసేవాడు, అవమానించేవాడు.

ద్రోణుడు చెప్పిన విధంగా అస్త్రప్రయోగాలను సామర్థ్యంతో చేస్తూ వచ్చినవాడు ఒక్క అర్జునుడే. అందుచేత ద్రోణుడు, అర్జునుడు తనంతవాడు కాగలడని అనుకుంటూ ఉండేవాడు.





ద్రోణుడు ఒకపని చేసేవాడు. శిష్యు లందరికీ చెంబులిచ్చి నీరు తెమ్మనేవాడు; తన కొడుకైన అశ్వత్థామకు పెద్ద మూతిగల చెంబు ఇచ్చి, మిగిలినవారికి చిన్న మూతి గల చెంబు లిచ్చేవాడు; ముందు వచ్చిన వారికి అనేక అస్త్రరహస్యాలు చెబుతూండే వాడు. పెద్ద మూతిగల చెంబు తీసుకున్న అశ్వత్థామ తన చెంబును శీఘ్రంగా నించు కుని ముందు వచ్చేవాడు. అర్జునుడు, తన చెంబుమూతి చిన్నదైనా, వారుణాస్త్ర ప్రభావంతో దాన్ని శీఘ్రంగా నించుకుని, అశ్వత్థామతోపాటే తిరిగి వచ్చి, అశ్వత్థామ నేర్చుకున్న రహస్యవిద్యలన్నీ తాను కూడా నేర్చుకునేవాడు. ఈ కారణంగా అశ్వత్థామకు అర్జునుడంటే చాలా అసూయ ఉండేది.

ద్రోణుడి ఇంట ఒక రాత్రి శిష్యులంతా భోజనం చేస్తూండగా గాలికొట్టి దీపం ఆరి పోయింది. అందువల్ల భోజనంచెయ్యటాని కేమీ ఇబ్బంది కలగకపోవటం గ్రహించి అర్జునుడు, "అభ్యాసం వల్లగదా చీకటిలో కూడా అన్నం తినగలుగుతున్నాను. చీక టిలోనే విలువిద్య ఎందుకు అభ్యసించ గూడదు?" అనుకుని, అలాచెయ్య నారం భించాడు.

ఒకరాత్రి ద్రోణుడికి ధనుష్టంకారం విని నిద్రాభంగమయింది. ఆయన లేచి వచ్చి, అర్జునుడు చీకట్లో విలువిద్యాభ్యాసం చేస్తూ ఉండటం గమనించి, కౌగలించుకుని, "నాయనా, నీతో సమానమైన విలుకాడు మరొకడు లేడనిపించేలాగా నిన్ను తయారు చేస్తాను," అన్నాడు. అన్నవిధంగానే ఆయన అర్జునుడికి దొమ్మియుద్ధం ఎలా చేయాలో, రథాలమధ్యా, ఏనుగులమధ్యా నేలపై నిలబడి ఎలా యుద్ధంచెయ్యాలో, గదలూ మొదలైనవాటితో యుద్ధం ఎలా చెయ్యాలో, వాటిలోని రహస్యాలన్నిటితో సహా నేర్పాడు.





# గాంధీ కథ

## 7

గాంధీ మీద ఈ దాడి జరిగినది 1897 జనవరి 13 న. అది ముఖ్యమైన రోజు. ఆ రోజు నుంచి భారతీయులలోనూ, కొంత మంది ఆలోచనాపరులైన తెల్లవారిలోనూ గాంధీకి గౌరవం పెరిగింది.

1899 లో బోయెర్ యుద్ధం జరిగింది. దక్షిణాఫ్రికాలో పెత్తనం బోయెర్లదా, బ్రిటిషువాళ్ళదా అన్నది తేల్చుకోవటానికే ఈ యుద్ధం జరిగింది. భారతీయుల పట్ల రెండు జాతులవాళ్ళూ అక్రమంగానే ప్రవర్తించారు. అందుచేత ఈ యుద్ధం పట్ల నేటాలు భారతీయులు ఎలాటి వైఖరి అవలంబించా లన్నది గాంధీకి గడ్డు సమస్య అయింది. అప్పటి కింకా ఆయనలో శాంతి అహింసల సిద్ధాంతం బాగా రూపొంద లేదు. గాంధీ ఈ యుద్ధంలో బ్రిటిషువారినే బలపరచ నిశ్చయించాడు. బ్రిటిషు సామ్రాజ్యంలో అప్పటి కింకా విశ్వాసం ఉండటమే ఆయన నిర్ణయానికి కారణం. యుద్ధంలో బోయేర్లే గెలుస్తారనీ, అందుచేత భారతీయులు తటస్థంగా ఉంటే లాభం ఉన్నదనీ కొందరు భావిస్తే, దాన్ని గాంధీ పిరికివాద మని కొట్టేశాడు.

భారతీయులలో అధిక సంఖ్యాకులు గాంధీ పద్ధతినే అవలంబించారు. కాని బ్రిటిషువారు వారి సహకారాన్ని వెంటనే స్వీకరించలేదు. యుద్ధంలో బ్రిటిషువారు బాగా దెబ్బతిన్న సమయంలో భారతీయ అంబులెన్స్ దళం ఒకటి ఏర్పరచటానికి అనుమతి లభించింది. ఈ దళానికి గాంధీ నాయకుడు. అందులో 1100 మంది భారతీయులు పనిచేశారు. యుద్ధరంగంలో గాయపడిన వారిని దూరంగా, 20 మైళ్ళలో ఉన్న స్థావరానికి చేర్చటం ఈ దళం పని.



ఈ అంబులెన్స్ దళం మంచి ప్రశంసలు పొందింది. ఇందులో ప్రముఖ పాత్ర వహించినవారు 37 మందికి పతకాలు బహూకరించబడ్డాయి. భారతీయుల పట్ల బ్రిటిషువారికి ఆదరం హెచ్చింది. ఇక నేటాలు భారతీయులకు తన అవసరం అంతగా ఉండదని, 1901 లో గాంధీ స్వదేశానికి బయలుదేరాడు. ఆ సమయంలోనే కలకత్తాలో కాంగ్రెసు సమావేశం జరిగింది. దానికి హాజరైన గాంధీకి కాంగ్రెసు శిబిరం పరిస్థితులు అరాజకంగానూ, అనారోగ్యకరంగానూ కనిపించాయి. ఆయనను ఎవరూ ఎరగరు. కాంగ్రెసు కార్యదర్శి దగ్గిర ఆయన గుమాస్తా పని, పత్రాలూ అవీ మోసే బేరరు పనీ చేశాడు.

ఆ సమావేశంలో ఆయన దక్షిణాఫ్రికాలోని భారతీయుల దుస్థితి గురించి ఒక తీర్మానం ప్రతిపాదింపజేశాడు.

సమావేశం ముగిశాక గాంధీ గోఖలేతో ఒక నెల గడిపాడు. గాంధీని భారతీయ రాజకీయ రంగంలోకి లాగాలని గోఖలే ఉద్దేశం. ఆయన సలహా ననుసరించి గాంధీ బొంబాయిలోని శాంటాక్రుజ్‌లో మంచి బంగళా తీసుకుని ప్రాక్టీసు ప్రారంభించి, త్వరలోనే వృద్ధిలోకి వచ్చాడు. కాని గోఖలే అనుకున్నట్టు జరగలేదు. దక్షిణాఫ్రికా నుంచి గాంధీకి మళ్లీ పిలుపు వచ్చింది. జరిగిన దేమిటంటే—

బ్రిటిషువారికీ బోయెర్లకూ యుద్ధం ప్రారంభమైనప్పుడు బ్రిటిషు ప్రభుత్వం భారతీయుల పట్ల బోయెర్లు వహించిన వైఖరిని విమర్శించింది. కాని యుద్ధం ముగిసినాక, బోయెర్ల చట్టాలను సంస్కరించటానికి బ్రిటిషు ప్రభుత్వం ఒక కమిటీని నియమించింది. ఈ కమిటీవారు బోయెర్లు అవలంబించిన జాతి విద్వేష విధానాలను మరింతగా బలపరిచారు. ట్రాన్స్‌వాల్‌లోని ఆసియావాసులను అదు

పులో ఉంచటానికి ఒక ప్రభుత్వ శాఖ కూడా ఏర్పాటయింది.

గాంధీ 1902 డిసెంబరులో డర్బాన్ చేరాడు. అప్పుడు బ్రిటిషు వలసల మంత్రి చాంబర్లేన్ అక్కడికి వచ్చి ఉన్నాడు. ఆయనను కలుసుకోవటానికి ఏర్పాటైన భారతీయ ప్రతినిధి వర్గానికి గాంధీ నాయకత్వం వహించాడు. వలసప్రభుత్వాలు సర్వస్వతంత్ర మైనవనీ, భారతీయులు అక్కడి ప్రభుత్వంతో ఏదో విధంగా సమాధాన పడటం మంచిదనీ చాంబర్లేన్ వారికి సలహా ఇచ్చాడు.



చాంబర్లేన్ నేటాలు నుంచి ట్రాన్స్‌వాల్‌కు వెళ్ళినప్పుడు గాంధీ ట్రాన్స్‌వాల్ భారతీయులకు ప్రాతినిధ్యం వహించ యత్నించాడు, కాని ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం పడనివ్వలేదు. దక్షిణాఫ్రికా భారతీయులు గాంధీని అర్జంటుగా పిలిచిన పని ఇలా పరిణమించింది.

గాంధీ స్వదేశానికి తిరిగి వచ్చి తన కుటుంబంతో సుఖంగా జీవించటం తప్ప చేసేదేమీ కనిపించలేదు. కాని ఆయన, తనను అంతగా నమ్మిన దక్షిణాఫ్రికా భారతీయులను వారి కర్మకు వదిలి రాలేక పోయాడు. ఆయన ట్రాన్స్‌వాల్ సుప్రీమ్ కోర్టులో అటార్నీగా ఎన్‌రోల్ అయి, ప్రాక్టీసు ప్రారంభించాడు. ఆయన జీవితంలో ఇదొక పెద్ద మలుపు. దక్షిణాఫ్రికా భారతీయులు పోరాడవలసినది తెల్లవాళ్ళతో సమాన హక్కులకోసం కాదు—తమ ప్రాథమిక హక్కులకోసం. వారిని ప్రతిఘటించే శక్తులు పైశాచిక స్వభావం గలవి. ఇలాటి అసమ సమరానికి గాంధీ నాయకత్వం వహించాడు. ఇందుకుగాను ఆయన తన నైతిక, ఆధ్యాత్మిక శక్తులను ఎంతగానో పెంచుకోవలిసి వచ్చింది.

రాజకీయాలలో చురుకుగా పాల్గొనటం మూలాన గాంధీకి ప్రాక్టీసు పెరిగింది. ఆయన

సాలుసరి రాబడి అయిదువేల పౌనులకు హెచ్చింది. అయితే ఆయన వచ్చిన కేసల్లా పట్టలేదు. అక్రమమైన కేసులను చేపట్టటం తన వృత్తిధర్మంగా ఆయన ఏనాడూ భావించలేదు. డర్బానులోని తన మిత్రుడైన పార్సీ ఒకడు సుంకాలు ఎగవేసి గాంధీని సలహా అడిగాడు. గాంధీ అతనిని సమర్థించటానికి మారుగా, అధికారుల వద్దకు వెళ్ళి అతను చేసిన అక్రమాలన్నీ బయటపెట్టటానికి ఒప్పించాడు.

కోర్టు వ్యవహారాలను గురించే గాక, కుటుంబ సమస్యలను గురించీ, వ్యక్తిగతమైన సమస్యలను గురించీ కూడా చాలా మంది గాంధీని సలహాలు అడుగుతూండే వారు. రోగులకు ఆయన ప్రకృతి చికిత్సలు కూడా చేసేవాడు.

గాంధీ తన జీవితాన్ని వీలయినంత నిరాడంబరంగా తీర్చిదిద్దుకోవటానికి కృషి చేశాడు. తన బట్టలు తానే ఉతుక్కుని గంజిపెట్టుకునేవాడు. తన జుట్టు తానే క్రాపు చేసుకునేవాడు; తెల్ల మంగలవాళ్ళు ఆయనకు క్రాపుచేయ నిరాకరించారు! పేద భారతీయులకోసం ఏర్పడిన ఒక ధర్మ వైద్యశాలలో తాను మందులివ్వటం నేర్చుకున్నాడు. రోగులను కనిపెట్టి వుండటం గురించీ, ప్రసూతి గురించీ చదవటమే గాక, తన ఆఖరు కొడుకు పుట్టినప్పుడు తానే మంత్రసానితనం చేశాడు; మంత్రసాని సమయానికి రాలేదు.

గాంధీ బడిపంతులుపని కూడా చేశాడు. భారతీయుల పిల్లలను యూరోపియను బడులలో చదువుకోనివ్వరు. గాంధీ, తన పిల్లలకు ఆ అవకాశం ఉన్నప్పటికీ, వారిని బడికి పోనివ్వక, తానే చదువు చెప్పాడు. ఈ చదువు సరిగా సాగేదికాదు. మధ్య మధ్య క్లయంట్లో, మిత్రులో వచ్చేవారు. అయినా గాంధీ తన పిల్లలను తెల్లవాళ్ళ స్కూళ్ళలో చదవనివ్వలేదు.



# 94. వింత తామరాకులు

బొగోర్ (ఇండొనీసియా) బొటానికల్ గార్డెన్స్‌లో ఆరేసి అడుగుల నిడివి గల తామరాకులున్నాయి. ఇక్కడ వానలు జాస్తి కావడంచేత వృక్షజాతులు విరివిగా పెరుగుతాయి. బొగోర్ లోని ఈ ఉద్యానాన్ని 1817 లో ఒక జర్మను వృక్షశాస్త్రవేత్త ప్రారంభించాడు. ఈ ఉద్యానానికి అనుబంధంగా అనేక పరిశోధనాలయాలు ఏర్పాటయాయి. ఒక లైబ్రరీ, ఓషధీనిలయమూ, జీవశాస్త్ర సంబంధమైన మ్యూజియమూ కూడా ఇక్కడ ఉన్నాయి.



Chandamama Sep. '69 Photo by T. S. Nagarajan



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఏనుగ నోట్లో

పంపినవారు:
పి. మహలక్ష్మి, బూరగాం.

Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఏమిటి చెప్మా?

పంపినవారు:
పి. మహలక్ష్మి, బూరగాం.

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1969 నవంబర్ నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ సెప్టెంబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలించబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఏనుగ నోట్లో

రెండవ ఫోటో: ఏమిటి చెప్మా?

పంపినవారు: పి. మహలక్ష్మి,

బూరగాం. (శ్రీకాకుళం జిల్లా)

బహుమతి మొత్తం రు. 20/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

× ×












వారు లేసర్-రే తుపాకులతో నడుస్తుండగా, బలిష్ఠమైన అద్భుత బాలుడు—మంగళ గ్రహనివాసుల ఆకస్మాత్తు దాడిని ఎదుర్కొనేందుకు సిద్ధమయ్యాడు. ఉజ్జ్వల ప్రకాశమాన కాంతికిరణ కళ్లకు మిరుమిట్లు గొలిపింది... అద్భుత బాలుడు, ఉజ్జ్వల సంపూర్ణ కాంతుల నేత్రాలతో బ్రహ్మాండమైన దెబ్బ కొట్టాడు— ఆ మంగళగ్రహ నివాసుల కళ్లు మూసేసి వారిని బంధించాడు.



ఆదే సమయంలో మరియొక గుప్త-దాడి విజృంభించింది. అద్భుత బాలుడు తన పళ్లు తోముకోవటం మరిచిపోయాడు. మరి ఆమ్లాల సూక్ష్మ క్రిములు అతని పళ్లపై ఎనామెల్‌ను ముట్టడించాయి.



ఆహార అణువులు మిగిలిపోయినప్పుడు ఏసిడ్స్ (ఆమ్లములు) ఏర్పడి పళ్ళపైగల ఎనామెల్ యందు ప్రవేశించి, పనుకు దుర్బలంగా చేసి బాధాకరమైన సందులను కలిగించే సూక్ష్మ క్రిములకు తీవ్ర ధాతువులను వృద్ధిపరచును.

బినాకా ఫ్లోరైడ్ యందుగల ఎస్.ఎమ్.ఎఫ్.పి. పళ్ళపైగల ఎనామెల్ తో చేరి ఏసిడ్ల తాకిడిని నిరోధించ గలిగించును.

బినాకా ఫ్లోరైడ్ యందుగల ఎస్.ఎమ్. ఎఫ్.పి. పళ్ళపై గల ఎనామెల్‌ను ధ్వంస పరచే నోటి ఏసిడ్లు ఏర్పడకుండా నిలుపును.

బినాకా ఫ్లోరైడ్ యందుగల ఎస్.ఎమ్.ఎఫ్.పి. దంతక్షయ ప్రారంభ దశలోనే దక్కు-బరచుటకు పళ్ళపైగల ఎనామెల్‌కు సహాకరించును



అయితే ఆగండి! అద్భుత బాలుని అద్భుత జ్ఞాపక శక్తిని గమనించండి! ఎస్.ఎమ్. ఎఫ్.పి.— సోడియమ్. మోనో-ఫ్లోరో-ఫాస్ఫేట్ గుర్తుకొచ్చింది.



తన అద్భుత పళ్లను రక్షించుకొనే నిమిత్తం పళ్లను ఎస్.ఎమ్.ఎఫ్.పి. గల ఒక్క-టే టూత్‌పేస్టు బినాకా ఫ్లోరైడ్‌తో తోముకోవలెనని జ్ఞాపకం వచ్చింది.



అద్భుత-పళ్ల రక్షణకు ఎల్లవేళ్లా పిల్లలు బినాకా ఫ్లోరైడ్ ఉపయోగిస్తున్నారు

CIBA Cosmetics

# బినాకా ఫ్లోరైడ్

3

దంతక్షయం మరియు బాధాకరమైన సందుల మూడు రెట్ల-నిరోధానికి



× × ।

# ఫోస్‌ఫోమిన్



శక్తిని పెంపొందించును.



ఆకలిని అధికము చేయును.

సహనశక్తిని హెచ్చించును.



శరీరముయొక్క

రోగనిరోధక శక్తిని ఎక్కువ చేయును.

అవును —

కుటుంబము అంతటికి ఫోస్‌ఫోమిన్
వల్ల ఆరోగ్యము కలుగును.

ఫోస్‌ఫోమిన్...బి కాంప్లెక్స్ విటమినులు మల్టిపల్
గ్లిసరోఫోస్‌ఫేట్లుగల ఆకుపచ్చని పండ్ల రుచిగల టానిక్




® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి
రిజిష్టర్డ్ ట్రేడ్ మార్క్కు చిహ్నం: దీని లైసెన్సు
ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రయివేట్ లిమిటెడ్

SQUIBB

SARABHAI CHEMICALS

Shilpi SC 50 A/67 Tel

# టీకి
# సరిగావుండే
# జోడి
# బ్రిటానియా
# మారీ

టీతోపాటు ఆనందంగా తినుటకు
బ్రిటానియా మారీ బిస్కట్లు దివ్యంగా
వుంటాయి. తీపి తక్కువతో
కరకరలాడే ఈ బిస్కట్లు ఎంతో రుచిగా
వుంటాయి మరియు పోషకవంతము
లయినవి. రోజూ టీతోపాటు
బ్రిటానియా మారీ బిస్కట్లను
తిని ఆనందించండి!




బ్రిటానియా అంటే నాణ్యత

BBC-8398

చిత్ర కల్పన

# బుద్ధిమంతుడు

దర్శకుడు బాపు
విడుదల లక్ష్మీ ఫిలింస్

నిర్మాత N.S. మూర్తి . రచన ముళ్ళపూడి వెంకటరమణ
సంగీతం K.V. మహాదేవన్ . ఫొటోగ్రఫీ S. వెంకటరత్నం



# AWARDS!

# WON PLENTY

## YET WE DON'T SAY
## WE ARE THE BEST

### ONLY

## WE DO OUR BEST




**PRASAD PROCESS PRIVATE LTD**

CHANDAMAMA BUILDINGS MADRAS-26

